



పసి బిడ్డకు
జీర్ణసంబంధమైన
బాధలు కలిగినప్పుడు...

సౌమ్యంగా పనిచేసే

# అమృతాంజన్ గ్రైప్ మిక్స్చర్

బాధను అతి త్వరగా తగ్గిస్తుంది




గృహౌషధములు
తయారుచేయుటలో
తరతరాలుగా
నమ్మికకు పాత్రమైన
అమృతాంజన్ వారి
తయారి.

కడుపునొప్పి, అజీర్ణము, వాయువు, పళ్ళు పచ్చేటప్పుడు కలిగేబాధలు మొదలైన వాటిలో దేనితోనైనా సరే, మీ పసిబిడ్డ బాధ పడుతూంటే అమృతాంజన్ గ్రైప్ మిక్స్చర్‌తో అతి త్వరగా ఉపశమనం కల్గించండి త్వరగా సులభంగా తిరిగి మీ పసిబిడ్డ ఆనందంగా నవ్వుతుంది.

అమృతాంజన్ లిమిటెడ్

OBM 3410 TG

# మనలో మాట

ఈ వారంతో దీపావళి కథలపోటీలో సంపాదకుని ఎన్నికలో ఒక్కొక్కటి రూ 600ల చొప్పున బహుమతి పొందిన ఐదు కథల ప్రచురణ పూర్తి అయింది

ఇప్పుడు ఈ ఐదు కథలలోను పాఠకులు ఉత్తమ కథను నిర్ణయించ వలసి వున్నది.

ఇదే సంచికలో దిగువ యిస్తున్న బ్యాలట్ పత్రాన్ని మీకు నచ్చిన ఒకే ఒక్క కథ పేరులోను, మీ పూర్తి చిరునామాతోను నింపి మాకు 30–11–'77 లోగాగాని, సరిగ్గా అనాటికిగాని అందేలాగ పంపండి... ఈ బ్యాలట్‌లో ప్రథమ స్థానాన్ని పొందిన కథకి రూ. 600 లు బహుమతి లభిస్తుంది బ్యాలట్‌లో ద్వితీయ, తృతీయ స్థానాలు పొందిన కథలకి ఆ 'వరుస'లో రూ 500లు, రూ 400లు అదనపు బహుమతులు లభిస్తాయి తతిమ్మా రెండు కథలకీ కూడా ఒక్కోదానికి రూ 250 ల వంతున కన్సొలేషన్ బహుమతులు అందుతాయి మొత్తంమీద ఈ ఐదుగురు రచయితలకు కూడాఅదనపు బహుమతులు వుంటాయన్నమాట!

## వ్యాసరచన పోటీ

ఇంతేగాక బ్యాలట్‌లో పాల్గొంటున్న పాఠకులను ప్రోత్సహించే నిమిత్తం యీ కథలమీద వ్యాసరచన పోటీకూడా పోయినసారిలాగే నిర్వహిస్తున్నాము

దీపావళి కథలు ఐదింటి మీద కలిపి చిన్న వ్యాసం 800 అక్షరాలు దాటకుండా వ్రాయండి. దీంతోపాటు మీకు బాగా "నచ్చిన" కథ పేరు వ్రాసి మీ చిరునామాతో నింపిన బ్యాలట్ పత్రాన్ని జతచేసి–కవరులో పెట్టి కవరుమీద దీపావళి కథలపై

*వ్యాసరచన పోటీ సంపాదకుడు, ఆంధ్ర సచిత్ర వార పత్రిక, గాంధీనగరం, విజయవాడ-3* అన్న చిరునామాకు 30-11-77 లోగా అందేలా పంపండి

మాకు అందిన వ్యాసాలలో ఉత్తమ వ్యాసానికి రూ 250 లు బహుమతిగా యిస్తాము ద్వితీయ, తృతీయ స్థానాలలో ఎన్నుకోబడిన వ్యాసాలు మరి రెండిటికివరుసగా రూ 150లు రూ. 100 లు బహుమతులు అందజేస్తాము

పాఠకుల సౌకర్యార్థం దీపావళి కథలపేర్లు యిక్కడ యిస్తున్నాము

★ కలకాలం నిలిచేది

★ పేరులేని కథ

★ వన్ మినిట్

★ కామాక్షి కోరిక

★ ఆనందానికి ముందు వెనుకలు

ఈ పోటీలోను, బ్యాలట్‌లోను విరివిగా పాఠకులు పాల్గొంటారని ఆశిస్తున్నాము

. కత్తిరించండి .

**ఆంధ్రసచిత్రవారపత్రిక**

**బ్యాలట్ పత్రం** *ముగింపు తేదీ:* **30-11-'77**

**నాకు నచ్చిన దీపావళి కథ**

"......................................................"

పంపినవారి, పూర్తి పేరు :

చిరునామా .

వ్యాసం వుంది / లేదు.

సంతకం.

...కత్తిరించండి...

## ఉత్తరాలు

సుందర్ సప్తాహిక్

ఈ వారం మీ[మా] పత్రిక చూశాక, సుందర్ సప్తాహిక ... ... ... సచిత్రవార పత్రిక లన్న హిందీ స్నేహితుని మాటలుజ్ఞాపకం వచ్చాయి జయప్రద ... చిత్రంతో వయ్యారం ఒలకబోస్తే, తాజా కాలమ్ నెమలిలా నాట్యంచేశాయి రేపటి భయం కథలో కృష్ణారావు వ్రాసిన ఉత్తరం చాలా బాగుంది రాగబంధం, శాంతితీరం సీరియల్స్ పాసింజర్ ట్రయిన్‌లా పోతున్నాయి కవితలలో ఏమిటి పాడేది అందాన్ని చూపితే ఆకాశం ఏడుస్తోంది నిజాన్ని వెల్లడించింది రామలక్ష్మిగారి జవాబులు జి వి జి. గారి పేజి జనగణమన పాడి, వారఫలం జైహింద్ అని గుడ్‌బై చెప్పి మళ్ళీ హెరానికి ఎదురు చూడ మన్నాయి

ఆనారా, [ఖర్గపూర్]

సీరియల్

14—10—77 నాటి జయప్రద ముఖ చిత్రంలో వెలువడిన మీ[మా] ఆంధ్రసచిత్ర వారపత్రిక నా మనస్సునెంతో ఆకట్టుకున్నది. సీరియల్స్ శాంతితీరం చదువుచున్న కొద్దీ మమ్మల్ని మేమే మరిచి నట్టుగా ఉంటుంది ఈ వారం ప్రచురింపబడిన కథ చదివిన తర్వాత నరేంద్ర ఇంకా బ్రతికి ఉన్నాడని నా వూహ, మరి ఎంతవరకు నిజమో ముమ్ముందు ప్రచురణకొరకు ఎదురు చూడాలి ఏదిఏమైనా రచయిత్రి చక్కిలం విజయలక్ష్మిగారికి మా యొక్క అభివందనలు తెలుపకుండ వుండలేక పోతున్నాను ఇంకా ఈ మధ్య వేసే కార్టూన్స్ చెత్తగా ఉన్నవి దయ చేసి ఇక ముందైన అటువంటి కార్టూన్స్ వేసి శ్రోతలకు విసుగు పుట్టించరని ఆశిస్తూ—

జె. సామేల్ (పెంట్లవెల్లి)

# హార్లిక్స్
## మీకు ఎక్కువగా అవసరమయినప్పుడు శక్తినిచ్చే కీలకపోషక పదార్థం.







### గర్భవతిగా ఉన్న కాలంలో

గర్భిణీ స్త్రీకి మంచి సమతూకంలో ఉండి, తేలిగ్గా జీర్ణమయ్యే ఆహారం అవసరం. అందువల్లనే గర్భిణిగా ఉన్నప్పుడు హార్లిక్స్ ఆదర్శప్రాయమయిన ఆహారం. ఇది తల్లికీ, పిల్లకీ కూడా శరీర నిర్మాణానికి కావలసిన మాంస కృత్తులు, కార్బోహైడ్రేట్లు సరిఅయిన సమ తూకంలో సమకూరుస్తుంది. రాత్రిళ్ళు సేవించిన మలబద్ధకం ఉండదు. ఉదయమే నిస్సత్తువగా ఉండటం పోతుంది.




### అస్వస్థత / అస్వస్థనుంచి కోలుకునే కాలంలో

జబ్బు చేసినప్పుడు మీ శరీరం ఎంతో విలువయిన మాంసకృత్తులు, పోషక పదార్థాలు కోల్పోతుంది. దీనివల్ల నిస్సత్తువ ఏర్పడుతుంది. ఈ నష్టాలను భర్తీ చేసేందుకు హార్లిక్స్ తేలిగ్గా జీర్ణమయ్యే రూపంలో శరీర కణాల నిర్మాణానికి కావలసిన మాంస కృత్తులు, శక్తినిచ్చే కార్బోహైడ్రేట్లు ఖనిజాలు సమకూరుస్తుంది. దీనివల్ల మీరు త్వరగా కోలుకొంటారు. మళ్ళీ జబ్బు పడకుండా తట్టుకునే శక్తి ఏర్పడుతుంది.

## ప్రపంచమంతటా డాక్టర్లు సిఫార్సు చేశారు
## హార్లిక్స్ మంచి పుష్టికరమైనది

హార్లిక్స్ రిజిస్టర్డ్ ట్రేడ్ మార్క్

Hx-4559 Tel 1

వందలకొలది
నారింజపండ్ల రసపూరిత
మాధుర్యము గల

న్యూట్రిన్ ఆరెంజ్ కాండీలు

CAS NC 8 TE 77





బాలలూ! న్యూట్రిన్ ఆరెంజి కాండీలు ఉత్సాహపరిచే తీపి, పులుపు కలిగి వుంటాయి. తాజా నారింజపండ్ల రసముకంటె మిక్కిలి రుచిగా వుంటాయి. తింటేనే తెలుస్తుంది! యిప్పుడే తిని చూడండి.

ఒక్కొక్క
మిఠాయి యందు
ఫలరస పూరిత
విందు!




న్యూట్రిన్ కన్ఫెక్షనరీ కంపెనీ లిమిటెడ్, చిత్తూరు (ఆం.ప్ర)

హెచ్చరిక: ఈ బొమ్మ న్యూట్రిన్ మిఠాయివారి ట్రేడ్‌మార్కు.

# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
[1938 1972]
శుక్రవారం : 25-11-'77
పింగళనామ సం. కార్తీక శు. పౌర్ణమి
*సంపుటము 71 సంచిక 10*

సంపాదకుడు:
శివలెంక రాధాకృష్ణ

*

పోస్టులో ఏడాది చందా రు. 41-60
ఆరు మాసాలచందా రు. 20-80
విడిప్రతి వెల 75 పైసలు
ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ 520 003


## విషయానుక్రమణిక



లోకం పోకడ * ఊమెన్









# కామాక్షి కోరిక




*'జిహ్వా కో రుచి, పుర్రె కో బుద్ధి' - అన్నట్టు కామాక్షికి చాలా రోజుల నుండి ఓ చిత్రమైన 'కోరిక' ఉంది!*

కామాక్షి కోరిక వింటే — 'ఇదీ ఒక కోరికేనా?' అని కొట్టిపారేసేవారు కొందరుంటే, 'తీరని కోరికన్నమాట!' అని తెలిసినపుడు మాత్రం చిత్రంగా నవ్వేసేవారు ఎందరైనా ఉండొచ్చు!!

(ఆ దృష్ట్యా కామాక్షి కోరిక చిత్రమైనదే అవ్వొచ్చుగదా మరి!) అసలంతెందుకు? కామాక్షి భర్త ఈశ్వరరావుకూడా అంతపనీ చేసేడుకదా మరి!

అంతే! ఫక్కుమని నవ్వేసేడు ఈశ్వరరావు.

చిరుకోపంతో చిన్నబోయింది కామాక్షి మోము — గ్రహించుకున్న ఈశ్వరరావు నవ్వుని నొక్కిపట్టి, కామాక్షిని దగ్గరకు తీసుకొంటూ — "అదికాదోయ్! రోజూ మిమ్మల్నొట డుగుతాను కాదనరుగా అంటూనే 'ఇపుడొద్దులే! ఈసారి చెపుతాను' అంటూ ఉంటే ఇంకా ఏమిటో అనుకొన్నాను. ఇదేనా? దీనికే ఇంత ఇదైపోవాలా?" అంటూ 'అది' గుర్తొచ్చి కాబోలు ఫక్కున నవ్వబోయి తమాయించుకొని "అయినా! మనకో చిన్నారి పాపాయి రావాలి కదుటోయ్ ముందు!" అని తేలిగ్గా నవ్వేస్తూ కామాక్షిని మరింతగా హృదయానికి హత్తుకున్నాడు ఈశ్వరరావు.

కామాక్షి కోపం మరిచిపోయి కొద్దిగా సిగ్గుపడుతూ 'అవును కదూ!' అని తనలో

# దీపావళి కథల పోటీలో రూ 600 లు బహుమతి పొందిన కథ

తనే నవ్వుకుని... ఆపైన నిద్రలోకి జారిపోయింది.

కాని ఆ విషయం ఆమె అంతటితో వదిలేసిందంటే అది ఎంత మాత్రమూ నిజం కానేకాదు!

'దాహం వేసినపుడే గొయ్యి తవ్వటం మొదలెట్టొంకదా'—అన్న ధోరణిలో అవకాశం కోసం ఎదురుచూస్తూ అనుకొన్నదానిని సాధించేందుకు – అనుకూలించని పరిస్థితులతో పోటీపడి విఫల ప్రయత్నాలు చేస్తోనే ఉంది కామాక్షి!

తల్లి అవస్థను, తండ్రి పరిస్థితిని గ్రహించుకొన్నట్టు పెళ్ళై ఆరేళ్ళు గడిచినా పాపాయి – తాను వస్తున్న జాడ లేవీ తెలుపలేదు!

కామాక్షికి దిగులు పుట్టింది; తనకిక పాపాయి పుట్టదేమోనని! తల్లి దిగులు క్రమంగా విషమించదు కదా అనుకుందో, లేక – 'ఆలస్యం అమృతం విషమ'ని ఏవరేనా అనగా విందో ఏమోగాని మొత్తానికి మరుసటి ఏడాదిలోనే 'నే నొచ్చాసేనోచ్' అనేసింది పాపాయి!!

కామాక్షి లో—పాపాయి దిగులు తగ్గింది!

కాని— పాత గుబులు పెరిగింది!!

పుట్టిన పాపాయికి అయిదు నెలలు వచ్చాయిగాని, కామాక్షి కోరిక పుట్టిన దగ్గిరే ఉండిపోయింది.

అది ఇన్నాళ్ళుగా 'తీరని కోరిక' గా మిగిలి ఉన్నప్పటికినీ, అందుకు తగ్గ సమయమూ, ఇప్పుడే వచ్చాయి మరి!

అయితే ఇంతలో—

కామాక్షి పేర అన్న శేషగిరి వద్ద నుండి ఉత్తరం వచ్చింది — 'ఏదోమాసం వెళుతోంది కాబట్టి చంటిదాన్ని తీసుకొచ్చి మూడునిద్రలుచేసి వెళ్లవలసిందంటూ' మరో ముఖ్యవిషయం—'శాక రాక వస్తున్నావు ఈ సారయినా ఓ పదిరోజులుండి ఆ పైన పిల్లదాని 'అన్నప్రాసన' అవీ ఇక్కడే మన మైడితల్లి గుడిలో చేయించాలనీ, అలా చేయించుతానని అమ్మ మొక్కినదనీ' ఉంది అందులో.

* * *

కామాక్షి పుట్టింటికొచ్చి పదిరోజులు గడిచిపోయాయి. ముందుగానే అనుకున్నట్టుగా ఈశ్వరరావు వచ్చాడు మూడ్రోజుల ముందుగా! ఆ మరునాడే పాపకి గుడిలో అన్నప్రాసనా జరిగింది.

అనుకొన్నవి అనుకొన్నట్టు అన్నీ సవ్యంగానే జరిగిపోయాయి!! తెల్లారితే ప్రయాణం.

కామాక్షి కన్ను మూసిందన్న మాటేగాని కునుకు పట్టడంలేదు. ఇక్కడికొచ్చి రోజులు ఇట్టే గడిచిపోయినట్టుంది. ఏవేవో ఆలోచనలు ... ఎంతకీ నిద్ర రాక అసహనంగా అటూ ఇటూ కదిలింది కామాక్షి.

పక్కలో చంటిది గాఢంగా నిద్రపోతోంది.

వసారాలోనే తనకు కొద్ది దూరంలో ఉన్న పడకపైని భర్త— అవతల ఆరు బయలులో తల్లి— సీతమ్మ పిల్లలు బాబి, రాజీ. అన్న శేషగిరి : వదిన పార్వతి— అంతా ఎప్పుడో నిద్ర కొరిగారు.

చుట్టూ ఉన్న చీకటిలో చిన్నలైటూ నిద్దరోతున్నట్టే వుంది! కామాక్షికి దాహ మనిపించి, మంచం కిందకి వంగి అందుకొంది, నీళ్ళు చల్లగా లేవేమో తాగాలనిపించలేదు!

మెల్లగా తలుపుతీసి లోపలి కెళ్లింది కామాక్షి. వంటింటి లైటువేసి కుండలో నీళ్లందుకొని తాగి, గ్లాసక్కడ పెడుతూ అటువైపు చూసింది.

మూలగా గోడలోకి బిగించిన నాలుగడుగుల ఎత్తున చెక్క అల్మైరా!! పుట్టి పెరిగిన తనకీ ఇంట ప్రతి అంగుళమూ తెలిసినదే. కానయితే ఈనాడది కొత్తగా వింతగా కామాక్షి చూపులనీ, మనస్సునీ ఆకర్షిస్తోంది! అందుక్కారణం? ఉదయం సంగతి కళ్లముందు మెదిలింది కామాక్షికి—

...ఉదయం కాఫీలయ్యాయి. అవతల కొంపేదో మునిగినట్టు పరిగెత్తే పొద్దులాగే కంగారెక్కువయిన లచ్చి పెరటి గుమ్మం లోంచి పిలుస్తోంది— "అమ్మగోరో" అంటూ

'వదిన వీధి వాకింట్లో ఉంది కాబోలను కుంటూ. అక్కడే ఉన్న కామాక్షి "ఏమిటే లచ్చి" అంది.

"ఇయిగోనండమ్మా! గాజు గలాసులు. ఓసైనా మట్టెత్తే బద్దలయిపోను, జాగ్త ఎట్టుకోండి. అలమరాలో ఎట్టుకుంటారు కామోను. నే బెగిపారెళ్ళాలి మరి!" అంటూ అవన్ని చేతి కందించి అదెళ్ళిపోయింది.

దాని హడావుడికి నవ్వుకుంటూ లోపలి కొచ్చి ఒకచేత్తో గ్లాసులు పట్టుకునే, మరో చేత్తో అల్మైరా తెరిచింది కామాక్షి.

అంతే!!!

అలాగే చూస్తూ దిగ్భ్రాంతి తో బిగుసుకు పోయినట్టు నిలబడి పోయింది కామాక్షి!!

"అమ్మాయ్! కామాక్షీ పాప లేచిందే...!" తల్లి సీతమ్మ కేకతో ఉలికి పడి, చేతిలోవి అందులో పెట్టి, అల్మైరా మూసి అక్కడి నుంచి వచ్చేసింది ......

ఆలోచనలోంచి తేరుకొని చూసేసరికి అప్పటికే దాని ముందర నిలబడి ఉంది కామాక్షి. అల్మైరా తలుపు తెరుస్తుంటే ఎందుకో గాని చేతులు వణికాయి!

ఎట్ట ఎదురుగా ఇన్నాళ్ళుగా కాదు కాదు ఎన్నేళ్ళుగా ఎదురు చూసిన తనకెంతో అపురూపమైన 'కోరిక'—ప్రతిరూపం, 'ఎక్కడ ఎక్కడ దాక్కున్నానో చెప్పుకో..' అన్నట్టు ఆ అలమారు పై అరలో మూల కూచొని నవ్వుతోంది కామాక్షిని చూసి.

అవును! అదే...అదే...

నొక్కులు నొక్కులుగా ఉన్న అంచూ, మధ్య భాగాన ఏవో పల్చని నగిషీ పూతలూ క్రింద గీడెత్తు అంచూ – తళ తళ మెరిసి పోతూ ముద్దులొలుకుతూ ...

అవును! అదే ...

పాపాయికి పాలబువ్వ తినిపించే వెండి గిన్నె!!!

అబ్బ! ఎంత బావుందో ... ఛటుక్కున చేతిలోకి తీసుకొని తన్మయత్వంతో తనివితీరా ముద్దు పెట్టుకుంది కామాక్షి!!

అప్పటి రోజుల్లో కేవలం కంటితో చూసేందుకే తనెంత తహతహ లాడేదనీ ?!

అప్పుడు తనకి దాదాపు పదేళ్ళ లోపే ఉంటాయేమో! ప్రతిరోజూ సాయంత్రమయితే చాలు. ఆటలు కట్టిపెట్టి ఇంటి ముందున్న అరుగుమీదకి చేరిపోయేది తను— ఎదురింటి డాబా వైపే చూస్తూ!!

సన్నని చీకట్లతోపాటు చక్కని చందమామా వస్తున్న – ఆ చల్లనివేళ తెల్లగా, బొద్దుగా ఉన్న బాబులాగే ముద్దు లొలుకుతున్న 'వెండిగిన్నె'లో – అన్నం పెడుతూ

డాబా మీద నుంచుని కనిపించేది సుభద్రమ్మ గారు రోజా.

బాబు కేరింతాలు కొడుతూ, చందమామను చూస్తూ మామ్మ పెట్టే గోరు ముద్దలన్నీ ఇట్టే తినేసేవాడు !

'శంఖంలో పోస్తే తీర్ధమయినట్టు' — ఆ వెండి గిన్నెలో ఏం తిన్నా అంత బాగుంటుందా అన్నట్టు ఆశ్చర్యతో కళ్ళు పెద్దవి చేసి మరీ చూసేది కామాక్షి !!

నా దగ్గరేం తిన్నా నా పోలికలిట్టే వచ్చేస్తాయన్నట్టు—తెల్లగా, ముద్దుగా ఉన్న బాబు ప్రక్కన తానూ — వెన్నెల్లో తెల్లగా తళతళ మంటూ మెరిసిపోయేది 'వెండిగిన్నె'!

బాబుని, వెండిగిన్నెని మార్చి మార్చి 'నిజమే' అనుకొనేది కామాక్షి !

నిత్యమూ ఏవో దిగుళ్ళతోనూ, దుఃఖంతోనూ — దైన్యం గూడు కట్టుకున్నట్టున్న ఆ కళ్ళలోకి చూస్తూ తల్లితోనే కాదు — ఎవరితోనూ ఎక్కువగా మాట్లాడని కామాక్షి—తనకు తానే ఏవేవో ఊహించుకునేది.

చివరగా ఆ పసితనపు ఊహలు ఎంత వరకూ వెళ్ళాయంటే—'వెండిగిన్నె' అంటేనే అదో అద్భుతమని ! ఆ చిన్నారి మనసుని అంతగా ఆకట్టుకొన్న 'వెండిగిన్నె' — ఎలాగైనా ఎప్పటికైనా అందుకోవాలన్న తపన 'కోరిక'గా మారి శాశ్వితంగా నిలిచిపోవటం— పెద్ద వింతేమీ కాదు !! అయితే కామాక్షి క్రమంగా పెద్దదయ్యేకొలదీ అదొక అద్భుతమన్న భావం మాసిపోయినా, ఆ 'కోరిక' మాత్రం అలాగే మిగిలిపోయింది !! అంతే కాదు !... అప్పటి నుండి అది కామాక్షి మనస్సులో 'వటుడింతై ... అంతై ...' అన్నట్టు వటవృక్షంలా విస్తరించి పోయింది కూడానూ — 'కోరిక' ఏదైనా — దాని విలువ ఎంతైనా దానిమీద మనకున్న ఇష్టమే కాదు — దాన్ని పొందలేని పరిస్థితులూ దాని స్థానాన్ని మరింత ఎత్తుకి పెంచేస్తాయి కాబోలు —

సరిగ్గా కామాక్షి విషయంలోనూ ఇంతే జరిగింది మరి !!...

'పిల్లనిచ్చేచోట పెద్దింటినీ, తెచ్చేచోట చిన్నింటిని' చూడమన్నది — మన సాంప్రదాయపు 'సూక్తి' !!

అయితే సాంప్రదాయపు పేరుతో వచ్చే అర్ధంలేని మూఢ నమ్మకాల్లోనూ, అవకతవకపు ఆచార వ్యవహారాల్లోనూ — ఎవరు

# కామాక్షి కోరిక

ఏింతవరకూ మారారో ఏమోగానీ... ఈ విషయంలో మాత్రం మనుషులంతా మారిపోయారన్నది ముమ్మాటికీ నిజం !!!

అందుకు నిదర్శనగా —

చనిపోయిన తండ్రి అండదండలు లేక తల్లి అష్టకష్టాలలో పెరిగి పెద్దవారయిన కామాక్షికీ, అన్న శేషగిరికీ వచ్చిన సంబంధాలే ఋజువు —

పిల్లాడు బుద్ధిమంతుడు, చదువుకున్నాడు — ఇంతకంటె మంచి గొప్ప అర్హతలు మరేం కావాలి 'అన్నట్టు ఉద్యోగం సద్యోగం అంతా మాపూచి' అంటూ శేషగిరికి కోరి పార్వతి నివ్వటమే కాదు పెళ్ళీ వాళ్ళే జరిపేశారు !

కామాక్షి కురూపి కాదు. చూడ తగ్గంతలో చక్కనిదే కొద్ది అయినా చదూకొంది. కష్టాల్లో పుట్టింది—అందులోనే పెరిగింది!వాటిని అర్ధం చేసుకునే నేర్పేకాదు; వాటికి తట్టుకొనే ఓర్పూ ఉందీ — ఇంతకంటె మరేంకావాలి అంటూ ఎవరూ ముందుకు రాలేదు.

పైగా కట్నంగా ముట్టవలసిన పైకం కాస్త ఆలస్యమే అయినా తప్పక అందుతుందని రూఢి పరచుకొని — 'ఏడాదయినా ఎదురు చూస్తామం' టూ వెనక్కి వెళ్ళేరు— వచ్చిన వియ్యాలవారు !!

నిశ్చితార్ధమయినా పెళ్ళికి నిదానించిన వాళ్ళ హృదయ వైశాల్యానికి అందరూ వేనోళ్ళ కొనియాడటమే కాకుండా, అటువంటి వారి ఇంటి కోడలవుతోన్నందుకు కామాక్షిని 'నీవదృష్టవంతురాలివే'అంటూ తల నిమరటం అన్నది వేరే విషయం.

ఎలాగయితేనేం కామాక్షికి ఈశ్వర్రావుతో పెళ్ళయింది ! అత్తింట్లో కామాక్షి తనకున్న చిన్న చిన్న మరుదుల్ని, బుల్లి బుల్లి ఆడబడుచుల్ని—చూసి తెగ సంతోషించింది! కాని వాళ్ళ మధ్య ఉండవలసిన అవసరం తప్పిపోయి, భర్తకు వేరే ఊర్లోఉద్యోగం అవడం వల్ల - తెగ విచారించింది కూడా !!

కామాక్షి మామ గారు ఇంకా బాధ్యతల నుండి రిటైర్ కాకపోయినా ఉద్యోగం నుండి మాత్రం రిటైరయి పోయారు. అయితే నేం అందుకు వారసుడ్ని 'నేను లేనూ' అంటూ ఆ గొర్రె తోక బెత్తెడు జీతం గుమస్తా బ్రతుక్కి ఆయన ప్రతినిధి అయ్యాడు పెద్ద కొడుకు ఈశ్వర్రావు !

ప్రతినెలా జీతంలో సగానికి పైగా ఇంటికి పంపించేయటం, ఉన్నదానిలో ఏదో మేమూ 'ఇంత తింటున్నాం' అని ఒకరికొకరు తృప్తి పడటం ఈశ్వర్రావుకి, కామాక్షికీ కూడా అలవాటయ్యింది !!

అయితే కామాక్షికి ఇంతటి గడ్డు పరిస్థితుల్లోనూ 'వెండిగిన్నె' కోరిక గుర్తు ఉంది. అందుకు ఆమె చేస్తున్న ప్రయత్నాలకు నిదర్శనగా ఓ పండక్కి కొత్తచీర కట్టలేదు కామాక్షి ?'

మాటల్లో సంగతెత్తుసుకున్న ఇరుగు, పొరుగు స్నేహితులయిన వసంత, కమల ఒకటే నవ్వు.

వెనుక ఎలాటి బాదరబంది లేని వసంత "పది పదులకు పైని ఖరీదు చేయటం కూడా ఓ పెద్ద కోరికేనటోయ్ . ?!"అని నవ్వుతూనే తేలిగ్గా కొట్టిపారేస్తే ...

కలిమిగల కన్నవాళ్ళ అండ ఉన్న కమల "త్వరలో నో పాపాయిని కనేయవోయ్—మీ అమ్మగారితో సహా వెండిగిన్నె అదే పరిగెట్టు కొచ్చేస్తుంది" అంటూ చనువుగా హాస్యమాడి ...

ఇద్దరూ నవ్వుకుంటూ వెళ్ళిపోయారు!!!

లటుపైని కామాక్షి మరెన్నడూ 'నామకా కొనే ఆ కొత్తచీర' కట్టడం మానలేదు !

అందుక్కారణం ? — వసంత, కమల నవ్వేశారనీ కాదు ?! మరి ? కూడబెడుతున్నాననుకొన్నది ఎలాగూ కరిగిపోయింది— కష్టాల వేడికి ! కట్టుడికి చీరల్లేక కాలక్షేపము చేయటమూ కష్టమైపోయింది !!

చిగురించే కోరికతో — చావని ఆశతో— మరింకేదో ప్రయత్నం... ఫలితం... ఏదో ఆపద... మరేదో అవసరం... ఇంకేదో ఆటంకం... ప్చ్.. ఏది ఏదైనా ఎన్నాళ్ళకీ.. ఎన్నేళ్ళకీ — తను అనుకొన్నది నెరవేరలేదు ! కోరుకున్నది తీరనేలేదు !!

... కళ్ళముందు కదిలిపోయిన గతానికి గుర్తుగా కామాక్షి కళ్ళనిండా నీళ్ళు —

చేతిలోని 'వెండిగిన్నె' పై వెచ్చగా జారిన కన్నీళ్ళు —

కలతబారిన మనసుతో... సన్నని వణుకుతో కంపిస్తున్న చేతులో... మరుక్షణం ఉలికి పడింది కామాక్షి - 'వెండిగిన్నె' ఉన్న చోట ఉంచబోయి ఆగిపోతూ ?!?!

చేస్తోన్నపని చూడకలేక మూసుకున్న

కళ్ళుతెరిచి మరోసారి స్పష్టంగా చూసింది.. 'హమ్మయ్య' లేదు! అలా జరగలేదు!! చేజారిందనుకొన్న వస్తువు జారిపోలేదు!!

చేతిలోని 'వెండిగిన్నె' క్షేమంగా వెన్నెల పువ్వులా నవ్వుతోంది!!!

అదోరకం తృప్తితో హాయిగా నవ్వుకుంది కామాక్షి వో క్షణం!!

ఈ రోజువరకూ తను దీనిని చూడనే లేదు! అంతేకాదు – ఇకముందు చూడ లేదేమో కూడా?! అవునుమరి ఎలా చూడగలదు...? తనదికాని దానిని తనెలా చూడగలదు...? అవును...'తనది కాదు'? కానే కాదు...?? తమ కన్నారింటినుంచి తను కన్న బిడ్డలకు హక్కుగా... గొప్పగా... తెచ్చుకొందిది – వదిన! అంతే!! తనదెలా అవుతుంది...? ...మరి తనది కాని దీనిపై ఈ తపనేమిటి? ఏదో అయ్యిందని బాధెందుకు!? మరేదో కాలేదని తృప్తెందుకు!?... కామాక్షికేం అర్థం కాలేదు!!... ఆపై మెదడులో రకరకాల ఆలోచనలు బయలుదేరాయి...

నిజంగానే వెండిగిన్నె క్రిందపడి ఉంటే? ఏమైనా అయిఉంటే? ... తన కెంతో అందంగా, అపురూపంగా కనిపిస్తున్న ఈ రూపం...?!?!... ఈ రకం ఆలోచనలు కామాక్షిలో వో కొత్త సంచలనాన్ని సృష్టించాయి.

మరు నిముషంలో కామాక్షి– ఆ క్షణం వరకు కలనైనా ఊహించనంత చిత్రంగా... విచిత్రంగా... ప్రవర్తించింది?!

ఫలితం?...

అప్పటిదాకా నవ్వుతూన్న 'వెండిగిన్నె'— లోనికి తోసుకుపోయిన నొక్కుల అంచుతో పక్షవాతపు రోగి నోరులా 'వంకర'గాపెట్టుకుని నిస్సహాయంగానిశ్శబ్దంగాఏడుస్తోంది!!

'వెండిగిన్నె' యథాస్థానంలో ఉంచుతూ కసిగాతలుపు మూసి, తృప్తిగా నవ్వుకుంటూ వచ్చి– మంచంమీద వాలిపోయింది కామాక్షి!

ఆపై ఆలోచనలు ముందుకు సాగనివ్వకుండా గట్టిగా కళ్లు మూసుకొంది కామాక్షి– చంటిదానిపై చెయ్యుంచుతూ!!

*          *          *

మసక మసక చీకట్లు మధ్య అప్పుడే తెల తెల వారుతున్న తూర్పు తెల్లబోతూ చూసింది... ఆ యింట్లోని– ప్రయాణపు హడావుడిని సన్నాహపు సందడిని!!

అప్పటికే బయట రిక్షా ఆగిఉంది! చేరవలసిన సామాను చేరిపోయింది. అక్కడే నిలబడివున్న ఈశ్వర్రావు – బావగారితో మాటాడుతూనే లోపలికి, మధ్య మధ్య వాచీలోకి చూస్తున్నాడు!!

ఇంటిలోపల కామాక్షి అందరితో ఆఖరిసారి చెప్పి, ఇంక బయలు దేరింది. తల్లిచేతిలోంచి చంటిదాన్ని అందుకొంటూ మరోసారి "వస్తానమ్మా" అంటూ,అప్పటికే మరిన్ని సార్లు చెప్పి ఉండటంవల్ల వదిన వైపు నవ్వుతూ చూసింది– 'వెళ్లొస్తా' నన్నట్లు.

గుమ్మం దిగుతున్న కామాక్షివైపు జవాబుగా తనూ నవ్వి, అంతలో ఏదో గుర్తొచ్చినట్లు ఛటుక్కున లేచింది పార్వతి–

"అయ్యో నా మతి! సమయానికిమరిచేపోయేను. మా పిల్ల వెధవల కెలాగూ పనికిరాదు! ఇక నుంచి వంటిదానికి రోజూ ఉపయోగమేను! ఓ నిముషమాగు కామాక్షి– 'వెండిగిన్నె' వెంట తీసుకెడుదువు... తెస్తాను" అంటూనే అదరా బాదరా లోనికెళ్లింది పార్వతి.

"కామాక్షి! త్వరగా. అవతల బండికి టైమైపోతోంది" ఈశ్వర్రావు కేక! అసలేమి వినిపించనట్టే అవాక్కయి చూస్తూ నిలబడి పోయింది కామాక్షి!!!

# జీవన పోరాటంలో — ఆశల ఆరాటం

సీరియల్

పి.వి.ఆర్. శివకుమార్

గత రెండు నెలలుగా సాంబయ్యగారి వైద్యానికే చాలా ఖర్చు అవుతోంది.

ఆయన లేకపోవటంతో, వ్యవసాయం పనులుగూడా పొరుగువాళ్ళని బతిమాలి చేయించుకోవటం అవుతోంది. బాబుగూడా పొలానికి వెళ్ళివస్తున్నాడు.

ఈ భారాలన్నిటికి తోడు భాను వెంటనే వెళ్ళి కాలేజీలో చేరాలి.

"నీకు స్కాలర్ షిప్పు లన్నా ఏమీ రావ్రటా ?" అనడిగారు సాంబయ్యగారు.

"నేనేం చీకూ–చింతా లేకుండా చదివి, ఫస్టుక్లాసులో ప్యాస్ కావటంలేదు. లేదా షెడ్యూల్డ్‌కాస్టు వాణ్ణీ కాదు, స్కాలర్షిప్పులు రావటానికి !"

"ఆస్తిపాస్తుల్లేని మనలాటివాళ్ళకూడా ఏవో యిస్తారుట..." అన్నారు ఆయన అమాయకంగా.

"అవి తీసుకోవటానికి మనకన్న లేనివాళ్ళు చాలామంది వున్నారు. అయినా లేకపోవటం ఒక్కటే కాదు – ఇంకా చాలా అడ్డదార్లు వుండాలి అవి రావటానికి !" అన్నాడు పెడసరంగా భాను.

నిజానికి భానుకి ఫస్టియర్లో సోషల్ వెల్ఫేర్ స్కాలర్షిప్ మూడొందలపైగా వచ్చింది – కానీ ఆ విషయం తండ్రిదాకా రాకుండానే జాగ్రత్త పడ్డాడు అతను. కాలేజీవాళ్ళు తండ్రికి స్కాలర్‌షిప్ విషయం తెలుపుతూ రాసిన ఉత్తరం ఆయనదాకా రాకుండానే, 'స్థానిక మిత్రుల్ని' ఉపయోగించి పోస్ట్‌మన్ దగ్గర్నుంచి అటే మళ్ళించేశాడు.

ఇవన్నీ తెలీని సాంబయ్యగారు, తన దురదృష్టానికి తననే నిందించుకుని, డబ్బు సంపాదించే మార్గంకోసం ఆలోచన్లో పడ్డారు.

ఏదోవిధంగా తండ్రి సర్దుబాటు చేసిన డబ్బు మాత్రం తీసుకుని, ఆయనా, మహాలక్ష్మమ్మా అతను బయల్దేరేదాకా గంటల కొద్దీ చెప్పబోసుకున్న గోడు మాత్రం అక్కడే వదిలి, బస్సెక్కాడు భాను.

(గత సంచిక తరువాయి)

## 13

మళ్ళీ చలనం. సీనియర్ స్టూడెంట్లు వచ్చి చేరినా, గత రెండు మూడు వారాలుగా స్తబ్ధంగానే వున్న హాస్టలు మగతా విద్యార్థులంతా రావటంతో పూర్తి చలనం పుంజుకుంది.

సూరిబాబు కూడా భాను లాగే రెండు సబ్జక్టులు మినహా గట్టెక్కి, సెకండియర్‌కి వచ్చాడు. ఈ సారి సూరిబాబుతో కలిసి రూము తీసుకోవాలనుకున్నాడు భాను. కాని కుదర్లేదు. రఘురాం అప్పటికి పదిహేనురోజుల క్రితమే వచ్చి, సింగల్ రూమ్ తీసుకున్నాడు. ఈ ఏడు కూడా భానునే తనతో వేసుకోవాలన్నఅభిప్రాయంతో భాను తరఫున కూడా అడ్వాన్సు కట్టేసి వుంచాడు అతను. గత సంవత్సర మంతా భాను చదువు వదిలేసి తిరిగినా, కనీసం తమ గదిలో మాత్రం అతడు స్నేహితులంటూ ఎవర్నీ చేర్చలేదు. పేకాటలో, మరోటో పెట్టి అతడిని ఇబ్బంది పెట్టలేదు అదే నచ్చింది రఘురాంకి. కాకపోయినా.

***జరిగినకథ 4 :*** అల్లరి చిల్లరిగా తిరుగుతూ చెడు సహవాసాలకి లోనైన కొడుకు భానుని పాలిటెక్నిక్‌లో చేర్పించమంటూ చెల్లెలు కౌసల్య, బావ శంకర్రావుల దగ్గరికి పంపిస్తాడు సాంబయ్య. క్రమశిక్షణకి ప్రాణం ఇచ్చే శంకర్రావుగారిసంతానం రాజు,రాధలు. హాస్టల్లో చేరిన భాను చదువుకోకుండా సిగరెట్లు తాగుతూ, పేకాడటం చూసిన శంకర్రావుగారు మందలిస్తారు. రాధకి శంకర్రావుగారు పెళ్ళి సంబంధాలు చూస్తున్నారని విని బాధపడతాడు భాను. సాంబయ్యగారికి పక్షవాతం రావటంతో అసలేఅంతంత మాత్రంగా ఉన్న ఆర్థిక పరిస్థితి మరింత క్షీణిస్తుంది.

ఇద్దరు బద్ధ శత్రువుల్నయినా, ఒక్క గదిలో నాలుగు నెలలపాటు కలిసి బతికే అవసరం కలిగిస్తే, క్రమంగా వాళ్ళు ఒకటైపోయే అవకాశం వుంది.

ఆ అవకాశమే, తనతో ఎక్కువగా కలియకపోయినా భానుతో ఒక అనుబంధం ఏర్పడేలా చేసింది రాఘురాంకి.

అతని మాట కాదనలేక, అదే అనుబంధానికి తనూ కట్టుబడుతూ ఆ గదిలోనే చేరిపోయాడు భాను.

వచ్చినరోజున మరీ సందడిగా వుంది సూరిబాబు, భాను లాటి వాళ్ళకి అందరి దగ్గరా డబ్బు వెతుక్కోనవసరం లేనంతగా వుంది.

మర్నాటి ఉదయమే పేకాటకి కూర్చున్నారు వాళ్ళు. పదకొండు గంటలయ్యేసరికే సుమారుగా వందరూపాయలు నష్టపోయాడు భాను. అతడికి మతిపోయి నట్లైంది. ఇంతమొత్తం ఒకేసారి ఓడిపోలేదు అతనెప్పుడూ. అసలే ఇంటి దగ్గర అడిగినంత డబ్బు అందలేదు. అందులో వంద తక్కువైతే, హాస్టల్ ఫీజుకో, కాలేజీ ఫీజుకో తక్కువౌతాయి ఎలా ?'

ఇంకా ఆడి ఆ డబ్బు రాబట్టుకోవాలనిపించిందిగానీ, మళ్ళీ భయం వేసింది. ఇహ ఆడకుండా, భోజనానికి వెళ్తాననిచెప్పి, అక్కణ్ణుంచి లేచాడు.

మెస్‌కెళ్ళి భోంచేసి తన రూం చేరుకున్నాడు. అక్కడా వుండబుద్ధి కాలేదు.

'అత్తయ్యగారింటి కెళ్తేనో?' అనుకున్నాడు. అనుకున్నదే తడవుగా లేచి, సూరిబాబు సైకిల్ తీసుకు బయల్దేరాడు.

ఎరుగున్న మనిషే అయినా, సైకిల్ చూసి బౌయ్ మంటూ అరిచింది టైగర్. దాని అరుపువిని బయటికి వచ్చిన రాధ, అతణ్ణి చూసి, గేటు తీసింది,

"ఎంత అదృష్టం! రాగానే నీదర్శనం" అన్నాడు భాను.

"అదృష్టమేం కాదు. ఇంట్లో యింకెవ్వరూ లేరు" అంది రాధ.

"అలాగా! ఎక్కడికెళ్ళారు?" ఆమె మాటలతో తనలో కలిగిన ఉత్సాహాన్ని సాధ్యమైనంత వరకూ బయట పడకుండా అదిమిపెడుతూ అడిగాడు భాను

"పక్కింటి ఎ. ఇ. గారి బంధువుల కెవరికో బాగుండలేని తెలిసి, ఆవిడతో పాటూ







# మీ బిడ్డలకు అమృతం
# పుష్టికరమైన అమృతం
# మీ పైరుకు అమృతం
# విజయ్



పిల్లలాగానే పైర్లు కూడా ఏపుగా పెరగాలంటే పుష్టికరమైన ఆహారం ఇవ్వాలి. అందుకై నత్రజని, భాస్వరం, పోటాష్‌లను అవసరమైనంతగా పైర్లకు వేయాలి. విజయ్ కాంప్లెక్స్ ఎరువుల్లో ఈ మూడు ముఖ్య పోషక పదార్థాలు సరియైన పాళ్ళలో వున్నాయి.

మీ భూముల, పంటల అవసరాన్ని గుర్తించి తయారు చేసిన కాంప్లెక్స్ ఎరువులే విజయ్ 17-17-17, విజయ్ 14-28-14, విజయ్ 24-24-0.

ఆసియాలో పెద్దది, అధునాతనమైనది అయిన మద్రాస్ ఫర్టిలైజర్స్‌వారి కర్మాగారంలో విజయ్ ఎరువులు మీకై తయారుచేయ బడుతున్నాయి.

విజయ్ ఎరువులనుగురించి ఇంకా వివరాలకు
ఈ క్రింది వారిని సంప్రదించండి.

ఏరియా మేనేజర్
మద్రాస్ ఫర్టిలైజర్స్ లిమిటెడ్
44, శాంతి నగర్ కాలనీ, హైదరాబాదు-500 028








డాక్టరుగారూ! నా బొమ్మ పాపకు
కులాసాగా లేదండీ.
కాస్త పరీక్ష చేయండి.

జ్వరం లేదు. కానీ,
కడుపునొప్పితో అవస్థ పడుతోంది.



పాపకు ఎప్పుడైనా
ఉపశమనంగా లేనప్పుడు
వుడ్‌వర్డ్స గ్రైప్‌వాటర్
ఉపశమనాన్ని చేకూర్చగలదు.
మా అమ్మకూడా నాకు
దీనినే యిచ్చేది.






# వుడ్‌వార్డ్స్ గ్రైప్ వాటర్

100 సంవత్సరాలకు పైగా చాతుర్యమైన
తల్లులకు విశ్వాసపాత్రమైనది.

వుడ్‌వర్డ్స్ కడుపునొప్పి, ఉబ్బరం, అజీర్ణ విరేచనాలు మరియు పాపలకు
పళ్లు వచ్చేప్పుడు సంభవించే బాధలను నివారించి ఉపశమనాన్ని చేకూర్చగలదు.

CAS.OPPL-1-TE 77

అమ్మకూడా వెళ్ళింది టౌన్‌కి. రాజు వాళ్ళ ఫ్రెండ్స్‌తో కలిసి సినిమా కెళ్ళాడు నాన్న గారు ఫ్యాక్టరీ కెళ్ళారు."

"అమ్మాయిగారు మాత్రంనాఅదృష్టం కొద్దీ ఇంట్లోనే వున్నారన్నమాట!". ముఖం చిట్లించి వూరుకుంది రాధ. ఏమీ జవాబు చెప్పకుండా.

"కాఫీ తాగుతావా?" అడిగింది.

"నీ దయ" అన్నాడు.

లోపలికి వెళ్ళింది రాధ భాను ఆలో చిస్తున్నాడు. 'మంచి అవకాశం ఇంతకన్నా దొరకదు. రాధతో వివరంగా మనసు విప్పి మాట్లాడితే?' ఎలా మాట్లాడాలో ఆలో చించసాగాడు.

అయిదు నిముషాల్లో బయటకు వచ్చింది రాధ, రెండు కాఫీ కప్పుల్లో ఒకటి భానుకి అందించింది. అందుకుంటూ తొట్రుపడ్డాడు భాను. ముందే వూహించినట్టుగా, మనసులోనే నవ్వుకుంది రాధ. అతడి ముఖ కవళికల్ని గమనిస్తూ కూర్చుంది.

ఎప్పుడగా వంటరిగా తనని కలుసుకోవా

## జీవనపోరాటంలో...

లని వెంపర్లాడే భాను, యీ అవకాశం వృధా పోనీయడని రాధకూడా అనుకుంది. అతడు తనని ప్రేమిస్తున్నానని చెప్తే ఏం జవాబివ్వాలోకూడా ఆమె ఆలోచించుకుంది. అయితే, ఆ జవాబు అతడి మనసుకి హత్తుకునేలా ఎలా చెప్పాలో ఆలోచిస్తోంది ఆమె.

ఇద్దరి ఆలోచనలూ అయిదు నిమిషాల్ని మింగేశాక.

"రాధా!" అన్నాడు భాను, "నీతో ఒక ముఖ్య విషయం మాట్లాడాలి. చాలా రోజులుగా అనుకుంటున్నానుగానీ, వీలు చిక్కలేదు."

"చెప్పు భానూ."

"నువ్వు... నువ్వు... యిప్పుడే పెళ్ళి వద్దని మామయ్యగారితో ఎందుకు అన్నావ్ రాధా?"

ఉలిక్కి పడింది రాధ. ఆ మాటలు యితను విన్నాడా? ఎలా విన్నాడు?

"ఇష్టంలేక పోయింది. ఏం?"

"అదే ఎందుకిష్టంలేక పోయిందీ అని...'

రాధకి చిరాకు వేసింది. అయినా వోపిగ్గా జవాబిచ్చింది.

"చదువు అర్ధాంతరంగా ఆపేసి, పెళ్ళి చేసుకోవాల్సినఅవసరం నాకుకనిపించలేదు."

"అవును. మరో రెండేళ్ళుపోతే, నీ చదువూ, నా చదువూకూడా పూర్తవుతాయి కదూ!"

"నీ చదువుకీ, నా చదువుకీ ఏమిటి లింకె?" అర్థం కానట్టే అడిగింది రాధ.

"అదే... మనిద్దరం ఒకటి కావాలని... నా కోరిక".

'తను కోరుకున్న జవాబు వచ్చింది' అనుకుంది రాధ.

"ఆ విషయం అలావుంచు. ముందు నా ప్రశ్నలకి జవాబు చెప్పు."

రాధ తనని ఔనన్నా, కాదన్నా వెంటనే మండిపడక పోయేసరికి, చాలా ధైర్యం వచ్చింది భానుకి.

"ఓయస్. అడుగు" అన్నాడు ఉత్సా



హంగా. ఓనిముషం ఆగి, మొదలెట్టిందిరాధ.

"మామయ్యగారి కెలావుంది ?"

'ఛ.' అనుకున్నాడు భాను. 'ఇదా యిప్పుడడగాల్సిన ప్రశ్న?' జవాబు మాత్రం చెప్పాడు.

"ఏం తగ్గలేదు రాధా ! అలాగే వుంది. నరాల బలహీనతకి ఇంజక్షన్స్, మందులూ వాడుతున్నాడు డాక్టర్. కానీ, తగ్గటం




# జీవనపోరాటంలో...

గురించి ఏం చెప్పలేదు యింకా."

"అరె. యిప్పుడు పొలాలవీ ఎవరు చూస్తారు మరి ?"

"మా నాన్న స్నేహితుడొకాయన చూస్తున్నాడు. ఆయన పొలమూ మా పొలందగ్గరే! బాబుగూడా వెళ్తున్నాళ్లే ఆయనతో !"

"బాబు.. బాబుకి తెలుసా ఆ పనులన్నీ!"

"ఆ! వాడికవన్నీ బాగా తెలుసు చిన్నప్పటినుంచీ నాన్నగారితో తిరుగుతున్నాడు కదూ !"

"చిన్నతనంకదా, అయినా !"

"చిన్నవాడైతే ఏమిటి ? అలవాటు – అంతే !"

"అంతేలే! చిన్నవాడైనా, పెద్దవాడైనా అలవాటు పడటంలోనే వుంది. మంచికి అలవాటు పడితే మంచివాడూ, చెడుకి అలవాటుపడితే చెడ్డవాడూ – కదూ ?" ఓరగా అతడికేసి చూస్తూ అంది రాధ. ఆ మాటల్లోని గూఢార్థానికి 'తికమక' పడి మాట్లాడకుండా వూరుకున్నాడు భాను.

"నీవి రెండు పేపర్లు పోయాయిటగా మొన్న ?"

"ఆఁ... అయినా అవి రేపు నవంబర్లో పూర్తిచేస్తున్నాలే !"

"మళ్లీ మళ్లీ రాయటం... మళ్లీ మళ్లీ రిజల్ట్స్‌కోసం ఎదురు చూడటం...ఎప్పటికో అప్పటికి అవకపోతాయిట్లే !"

నిరసనగా అంటూ రాధ నవ్విన నవ్వు భానులో కోపం రేకెత్తించింది. ఐనా మౌనంగా వుండిపోయాడు.

"అయినా నువ్వేం చేస్తావ్‌లే! ప్యాసవ్వాలంటే, కష్టపడి చదవాలి. చదవాలంటే చాలినంత తీరికా, ఓపికా వుండాలి. 'రేపు లేదన్న' ధ్యాసతో జల్సాలు చేస్తూ తిరిగేవాళ్లకి అంత తీరికెలా వుంటుంది?"

ఇంక వూరుకోలేకపోయాడు భాను.

"అంటే... నీ ఉద్దేశ్యం ఏమిటీ? నేనంత జులాయివాడిలాగా కనిపిస్తున్నానా?"

"అబ్బే... తెలుస్తున్నావు. మామయ్యకి ఆ పెరాలిసిస్ ఎందుకొచ్చిందో తెలుసా భానూ ?"

"నేను సరిగ్గా చదవకపోబట్టే కదూ?"

"నువ్వు వ్యంగ్యంగా అన్నా అదే నిజం. నువ్వు అనొచ్చు, ఆయనకి చిన్నప్పట్నుంచీ నరాల బలహీనత వుంది అదే కారణం అని. కానీ, కాస్త దూరం ఆలోచించు–

పెద్దకొడుకువయ్యుండి ఆయనకి కుడిభుజంగా మెలగాల్సినవాడివి, ఆయన భుజాలు కరిగిపోయేలా చాకిరీ చేస్తుంటే, బాధ్యతారహితంగా తిరుగుతూ, ఎత్తలేని బరువులెత్తి డబ్బు పంపుతుంటే, పరీక్షలు తప్పుతూ కూర్చుంటుంటే ఆయనకి అది తీరని మనోవ్యథ కాదూ ?

అతిగా ఆలోచించటం, విచారిస్తూ కూర్చోవటం – అవికాదూ ఆయన్ని కృంగదీసింది ?"

"... ... ... ..."

"నీకు కోపం రావచ్చు కానీ చిన్నదాన్నయినా ఎందుకింతగా నిలదీస్తున్నానో యోచించు.

నీకన్న చిన్నవాడయినా బాబుకున్నపాటి ఆలోచన నీకుందా ? అతను చేస్తున్నపాటి సహాయమైనా నువ్వు మీ నాన్నగారికి చేస్తున్నావా ?"

"వాడు దగ్గరున్నాడు కావటాన వాడికవి సాధ్యం !"

"నువ్వు దూరం నుంచి మాత్రం వాళ్లకి తృప్తి కలిగిస్తున్నావా ?"

"నే నిప్పుడేం చేస్తున్నాను ?"

"ఏం చెయ్యట్లేదో అడుగు. చదువు మీద శ్రద్ధలేదు. ఎప్పుడు చూసినా రోడ్లమీదుంటున్నావు. సిగరెట్లు, సినిమాలకి డబ్బు తగలేస్తున్నావు – యింకా ఏం చెయ్యాలి ?"

"ఎవరు చెప్పారుట నీ కివన్నీ ?" భాను మొహం జేవురించింది.

"నా కొకరు చెప్పనక్కర్లేదు. వాళ్లు చెప్పకుంటుంటే అవే వినబడతాయి."

"చెప్పేడు మాటలన్నీ నిజం అనుకోవటం తెలివితక్కువని నే నంటే ?"

"మొన్న మామయ్య, నాన్నని గుచ్చి గుచ్చి అడిగి, 'రేపు వాడెలా తయారయినా అందుకు నీదే బాధ్యత' అంటూ నిలదీస్తే నాన్నగారే ఆయనతో చెప్పారు, నువ్వు పాసవ్వటం అనుమానమే ననీ అప్పుడే చెప్పారు.

ఆయన చెప్పిన మాటలు అబద్ధాలే నంటావా ?"

# జీవన పోరాటంలో...

పళ్ళు నూరుకుంటూ కూర్చున్నాడు భాను.

"మా నాన్నగారి మీద పళ్ళు నూరితే లాభంలేదు భానూ! యివాళనువ్వు దాచినా, రేపు బయట పడవల్సిన నిజాలే అవన్నీ! నీ బలహీనత మీద పళ్ళు నూరుకో! నీ బాధ్యతా రాహిత్యం మీదా, యివాళ కళ్ళు తెరవకపోతే రేపు చీకటైపోయే నీ భవిష్యత్తు మీదా పళ్ళు నూరుకో!

"... ..."

"ఇన్ని యిలావుంచి, యిప్పుడు నువ్వు ఆలోచిస్తున్నది నీ పెళ్ళి గురించి — అని తలుచుకుంటే నీకు సిగ్గుగా లేదూ ?!!"

'నోర్ముయ్. అతిగా మాట్లాడకు' అనాలనుకున్నాడు. కానీ అనలేక పోయాడు భాను. అపరకాళిలా మాట్లాడుతున్న ఆమె మాటల్లో తనని నిగ్గదీస్తున్న నిజాలకి వెరచి, మాట్లాడలేక వూరుకున్నాడు.

"నువ్వు బాధ పడనంటే నా సమాధానం చెప్తాను— నీ ప్రశ్నకి" అంది రాధ.

"చెప్పు" విసురుగా అన్నాడు భాను

"నువ్వు... నువ్వంటే మొన్న మొన్నటిదాకా... అసహ్యం వుండేది! మీ యింటికి వచ్చిన తర్వాత నుంచీ, నిదానంగా ఆలోచించటం ప్రారంభించాక, అసహ్యం కన్నా జాలి ఎక్కువయింది..."

"ఒకరి జాలి నా కక్కర్లేదు."

"అది డైలాగు. ఒక్కొక్కప్పుడు మనిషికి సానుభూతీ జాలీ తప్పకుండా అవసరమవుతాయి. ప్రోత్సాహం, అండదండలు లాగే జాలీ సానుభూతీ కూడా మనిషికి అవసరమయ్యే ఘడియ లుంటాయి.

మామయ్యగారికి తన కష్టాలు తనే భరించి, మౌనంగా వుండిపోవటం తప్ప, ఎదుటి వాళ్ళని శాసించి తన మార్గానికి తివ్పుకునే చాకచక్యం లేదని అమ్మ దగ్గర వాపోయింది అత్తయ్య.

అది నిజమనే అనిపించింది నాకూనూ! కాకపోతే నిన్నింత నిర్లక్ష్యంగా పెంచేవారు కాదాయన!

నిన్ను ఇన్నాళ్ళుగా గమనించేక, నువ్వంటే నాకు కలిగిన అభిప్రాయం చెప్తా విను!

నువ్వొట్టి మైనం ముద్దలాటి వాడివి. నీ చుట్టూ పరిస్థితుల్ని బట్టి, స్నేహితుల గుణగణాల్ని బట్టి నీ వ్యక్తిత్వం రూపుదిద్దుకుంటుంది.

ఆ స్నేహితుల్ని సరయిన వాళ్ళని ఎన్నుకోకపోవటమే, తేలిక బతుక్కి లొంగిపోవటమే నువ్వు చేస్తున్న తప్పు."

"రాధా... హద్దుమీరి మాట్లాడుతున్నావ్!" ఇంక ఆపుకోలేక అరిచాడు భాను.

"ఫర్వాలేదు. ఒకోసారి గిరిదాటనిదే పని జరగదు ఇష్టమున్నా, లేకపోయినా, యిప్పుడు నువ్వు నా మాటలన్నీ వినాల్సిందే! ఆ తర్వాత నువ్వు నా అభిప్రాయం లక్ష్యపెట్టినా, పెట్టకపోయినా అది నీ యిష్టం! అయినా నిన్నింకా బాధించన్లే! నే చెప్పేది యిదే! మీ నాన్నకోసమో, మా నాన్నకోసమో కాక నీ బాగుకోసం — బాగుపడాలని ఆలోచించుకో! ఒక్కసారి నీ ప్రవర్తన గురించి ఆలోచించుకో!

నీమీదున్న బాధ్యతల్ని గుర్తించి. నెరవేర్చు. ఆ తరవాత పెళ్ళిగురించీ, సుఖాల గురించీ ఆలోచించు."

అంత ఖచ్చితంగా, అంత నిర్మొగమాటంగా, ఆలోచనా పూరితంగా, ఆవేశంగా ఆమె మాట్లాడగలదనీ, మాట్లాడుతుందనీ కలలోకూడా వూహించని భాను ఒక్కసారి తల తిరిగినట్టు ఫీలయ్యాడు.

"ఇంత శ్రమపడి, అయాచిత సలహా యిచ్చినందుకు చాలా థాంక్స్."

అనేసి, లేచి బయటికి నడిచాడు.

"ఉండు భానూ, అప్పుడే వెళ్తావేం ?" అంది రాధ.

"యిప్పుడింకా నాకిక్కడేం పని మిగిలిందని ?"

"అప్పుడే వెళ్ళిపోయాడేమని అమ్మ అడిగితే ఏం చెప్పను ?"

"అసలు నేను వచ్చినట్లే చెప్పకు."

మరోమాటకి అవకాశం లేకుండా, సైకిల్ తీసుకుని బయటికి దారితీశాడు భాను

గేటు మూసేసి, అతడు కనపడినంత వరకూ చూస్తూ నిలబడిపోయిన రాధకి, ఆమెకి తెలియకుండానే, ఎందుకో కళ్ళలో రెండు నీటిబొట్లు తిరిగాయి.

(ఇంకా ఉంది)

హలో!
నేనే మిస్టర్ బిజ్






మిస్టర్ బిజ్ తెస్తారు
మిలమిల్ల లాడే మెరుపు!
ఆ మెరుపు చూడాలనుందా?
మిస్టర్ బిజ్‌ను మీ వాడిని చేసుకోండి
శక్తివంతమైన బిజ్ ఫార్ములా ఏమాత్రం
శ్రమ లేకుండా జిడ్డును మురికిని
తుదముట్టించడాన్ని
స్వయంగా
గమనించండి
ఇప్పుడు చూడండి,
మీ గాజు సామాను, పాత్రలు,
నేలలు, శానిటరీవేర్ (వాష్ బేసిన్
మొదలైనవి) ఇదివరకెన్నడూ
లేనంతగా ఎలా మెరుస్తున్నాయో!






మిస్టర్ బిజ్ ప్రతిసారి
మీ డబ్బు ఆదా చేస్తారు!
అవును, మిస్టర్ బిజ్ ఒక్కరే
మీకివ్వగలరు 5-రీఫిల్ ప్యాక్. అందువల్ల
రీఫిల్‌కు రూ 1/- చొప్పున మీకు ఆదా అవుతుంది
అంటే మీరు 5 రీఫిల్ ప్యాక్
కొన్నప్పుడల్లా మీకు రూ 5/- ఆదా
అవుతుందన్న మాట. చూశారా,
ఎంత చక్కటి పొదుపో!

# బిజ్
## చక్కటి పొదుపు కోసం!

గోద్రెజ్ ఉత్పాదన

CASGS-107-234 TL

సీరియల్

# రాగబంధం

యార్లగడ్డ సరోజినీదేవి

విజయ పద్ధతే వేరు! ఆలోచనలే వేరు!

కాని!.. శ్రీనివాస్‌ని సరయిన మార్గంలో పెట్టే శక్తి ఒక్క విజయకే వున్నది. ఆ భావం, భారం విజయకి వదిలినంతమాత్రాన ఏ సమస్యా పరిష్కారం కాదు! తనే దారిలోకి తేవాలంటే చెయ్యిదాటిపోయాడు విజయను తీసుకురావటంలో భార్య ఉద్దేశ్యం రామనాధానికి నచ్చినా; శ్రీనివాస్‌కి విజయనిచ్చి వివాహం చేస్తే సుఖపడేబదులు కష్టాలే యెక్కువ అనుభవించుతుంది తనకింత సహాయం చేసిన జానికమ్మ ఋణం ఈవిధంగా తీర్చుకోవటం సుతరామూ రామనాధానికి ఇష్టం కలుగలేదు విజయకి అన్యాయం చేసినట్లే అవుతుందిగాని న్యాయం కలిగించినవాళ్లం కాలేము ఎక్కువ కట్నం యిచ్చి విజయకి మంచి సంబంధం చేస్తాను! అప్పుడే జానికమ్మకి తను ఋణం తీర్చుకున్నట్లు అవుతుంది.

కారు ఇంటిముందు ఆపేశాడు. గుండెల్లో సన్నగా నెప్పి మొదలయినది వళ్లంతా చెమట పట్టింది కాళ్లల్లో చేతుల్లో శక్తి లేనంత నీరస పడిపోయి కారు దిగి రెండడుగులు వేయకముందే కుప్పలా కూలిపోయాడు రామనాధం అది చూసి తోటమాలి విజయ పరుగున వచ్చి గబుక్కున తలను వడిలోకి తీసుకున్నది

అప్పుడే ఆఫీసు నుంచి వచ్చి టీ త్రాగుతున్న భాస్కర్ మాలి కబురు విని పరుగున వచ్చాడు ఇద్దరూ కలిసి రామనాధాన్ని ఇంటిలోకి చేర్చి మంచంమీద పడుకోబెట్టి వెంటనే డాక్టర్ కోసం ఫోన్ చేశాడు భాస్కర్ డాక్టర్ వచ్చేవరకూ ప్రథమ చికిత్సగా లాల్చీ గుండీలు తీసేసి

*(గత సంచిక తరువాయి)*

తడిగుడ్డతో ముఖం తుడవసాగాడు పార్వతమ్మకి అర్ధమయింది భర్త ఎందుకిలా అపస్మారకంలో పడిపోయాడన్నది హార్ట్ ఎటాక్ రావటం యిది రెండవసారి! భయంతో కళ్లు చెమర్చాయి ఏమిటా అలజడి అని మేడమీదనుంచి సుందరి దిగివచ్చింది. శ్రీనివాస్ మెట్లమీద ఓ క్షణం నిలబడి తిరిగి తన గదిలోకి వెళ్లిపోయాడు.

"తనకిన్ని గాయాలు తగిలితే ఒక్కసారి! ఒక్కసారి అయినా తనను పలుకరించారూ? ? తండ్రట! తండ్రి!!"

కోపంతో ఆవేశంతో పళ్లు నూరుకున్నాడు శ్రీనివాస్. అందుకే క్రిందకి వెళ్లి తండ్రిని చూడలేదు

డాక్టర్ వచ్చి ఇంజక్షన్ చేసి టాబ్‌లెట్సు వ్రాసి యిచ్చాడు. మరో నాలుగు గంటలకు వచ్చి చూస్తానని; కంగారు పడవలసిన పనిలేదని, తీవ్రంగా రాలేదుగాని కొంచెంగా హార్ట్ ఎటాక్ వచ్చిందని!" చెప్పి వెళ్లిపోయాడు.

స్పృహ వచ్చేవరకూ మంచానికి అటు ఇటు భాస్కర్ పార్వతమ్మ విజయ కూర్చునివున్నారు రామనాధం కొంచెంగా అటు ఇటు కదిలేసరికి –

"ఎలా వున్నదండీ?" అని పార్వతమ్మ

"ఎలా వున్నది నాన్నగారూ?" అని భాస్కర్

"బాధ తగ్గిందా మామయ్యా!" అని విజయ,

ముగ్గురూ ఒక్కసారే ప్రశ్నించారు అందరికీ కళ్లతోనే సైగ చేశాడు రామనాధం పళ్లరసం కొంచెంగా లేపి త్రాగించింది పార్వతమ్మ టాబ్‌లెట్టు వేశాడు భాస్కర్ చెమటతో తడిసిన లాల్చీని భాస్కర్ సాయంతో విప్పి మరోటి వేసింది విజయ. ఎలాగయితేనేమి ఆ రాత్రికి కొంచెంగా కోలుకున్నాడు రామనాధం డాక్టర్ ఆ రాత్రి కూడా చూసివెళ్లాడు

రెండు పూటలా డాక్టర్ వచ్చి చూడటం, విజయ పరిచర్యలు వల్లనయితేనేమి, పార్వతమ్మ టైంకి ఆహారం యివ్వటమేగాని చాలావరకు కోలుకున్నాడు రామనాధం ఒక రోజున డాక్టర్ వచ్చేసరికి ఎకౌంటు బుక్సు ముందేసుకుని కూర్చుని చూసుకుంటున్నాడు రామనాధం

"రండి డాక్టర్‌గారూ! రండి! ఏమీ తోచక చేస్తున్నాను వారం రోజులు ఆఫీసుకి వెళ్లక పోవటంతో ఎక్కడివి అక్కడే పడివున్నవి!" అన్నాడు రామనాధం నవ్వుతూ,

"మీకీ సమయంలో ఎంతో విశ్రాంతి అవసరం మీరెంత రెస్టు తీసుకుంటే అంత మంచిది మీ ఆరోగ్యానికి! మీరింకా నీర్సంగానే వున్నారు!"

"డాక్టర్సు అలాగే అంటారు నాకేమండీ? బాగానే వున్నానుగా!"

"మీరనుకుంటే సరిపోదు! మేమూ అనుకోవాలికదండీ? కొంత కాలం మీరు మరోక చోట విశ్రాంతిగా గడపాలి! ఆఫీసు, ఎకౌంట్సు, వర్కర్సులాంటివన్నీ మర్చిపోవాలి! అప్పుడే మీకు స్వస్థత చిక్కినట్లు!"

"నాన్నగారితో పోట్లాడుతున్నారేమిటి డాక్టర్?" ఆఫీసుకి వెళ్లేముందు తండ్రిని పలుకరించి వెళ్లటం భాస్కర్‌కి అలవాటు ఇప్పుడు కూడా అందుకే వచ్చాడు గదిలోకి

"ఏమున్నది భాస్కర్? మీరు బైట ఉద్యోగం చేయకపోతే మీ నాన్నగారికి విశ్రాంతినిచ్చి అవన్నీ మీరు చూసుకోకూడదూ?.."

"ఆ మాట నాన్నగారు చెప్పిందే ఎందుకని అగాను డాక్టర్! యికనుంచీ నాన్నగారికి అంగీకార మయితే తప్పకుండాను!" నాన్నగారి కండిషన్సు ఎలా వున్నాయి? పూర్తిగా ఆరోగ్యం చిక్కినట్లేనా?" అనడిగాడు భాస్కర్

"ఇంకా విశ్రాంతి అవసరం భాస్కర్! ఓ నెల రోజులపాటు ఎక్కడయినా వుండి పూర్తి విశ్రాంతి తీసుకుంటే చాలు! యింక మీ నాన్నగారి ఆరోగ్యానికి ఎలాంటి డోకా లేదు!"

"అలాగే డాక్టర్‌గారూ! ఎక్కడికో ఎందుకు? నాన్నగారి స్వగ్రామంలోనే వలభై ఎకరాల్లో మామిడి; నిమ్మ, సపోటా తోటలు వున్నాయి అన్ని వసతులతో వుండేందుకు చిన్న బంగళాకూడా వున్నది నాన్నగారు వెళ్లటమే ఆలస్యం! నౌఖర్లు అన్ని ఏర్పాటులు చేస్తారు ఇక్కడికి పది మైళ్లు కూడా వుండదు!"

"ఇప్పటికి యిప్పుడు పున్నపళంగా బైలుదేర మంటే ఎలాగు?" అనడిగాడు రామనాధం

"అన్నీ చూసుకునే భాస్కర్ వున్నాడు మీరు ఎంత తొందరగా వెళ్లితే అంత మంచిది!" అన్నాడు డాక్టర్

"నిజమే నాన్నగారూ! వెళ్లవలసిందే!"

"మీరెవ్వరూ బ్రతిమాలనవసరం లేదులెండి! మా మామయ్య అందరిలాంటివారు కాదు! ఎవరితోనూ పదిసార్లు చెప్పించుకునే అలవాటు

***జరిగిన కథ - 9:*** ముప్పయ్యేళ్లతర్వాత పుట్టింటి కెళ్లిన పార్వతమ్మ, వదిన జానకి చనిపోవటంతో చిన్ననాడే తండ్రిని, ఇప్పుడు తల్లిని కోల్పోయిన విజయని తనతో తీసుకువస్తుంది తన ఈ ఉన్నత స్థితికి కారణం భార్య పార్వతమ్మేనని రామనాధం నమ్మకం పార్వతమ్మ పెద్దకొడుకు భాస్కరం. అతని భార్య సుందరి సుందరికి పల్లెటూరితో కలసిమెలసి తిరగటం గిట్టదు. చిన్నకొడుకు శ్రీనివాస్‌కి దుడుకుతనం ఎక్కువ పాతికేళ్ల క్రితం . పరంధామయ్యగారి కొడుకులు జగన్నాథం, గోపాలంల భార్యలు సుభద్ర, జానకిలు కాపురానికి వెళ్లకుండానే వైధవ్యం పొందిన ఆడబిడ్డ పార్వతికి వివాహం చేయటానికి మామగారి అనుమతి తీసుకుంటుంది జానకి సుబ్బయ్య మాష్టారి శిష్యుడు రామనాధంతో పార్వతి వివాహం జరిపిస్తుంది జానకి ఇద్దరు మగపిల్లల తల్లవుతుంది పార్వతి పార్వతి జీవితం చక్కబడిందనే తృప్తితో కళ్లు మూస్తాడు పరంధామయ్య ... విజయ బి. ఏ. లో చేరుతుంది చదువుమీద శ్రద్ధలేక దురలవాట్లకు లోనైన శ్రీనివాస్ దుడుకు స్వభావాన్ని చూసి బాధపడ్తుంది విజయ.

వారికి లేదు. ఈ సాయంత్రానికంతా తోటలోకి వెళ్తారు! కదు మామయ్యా!''

పాలగ్లాసు తీసుకువచ్చిన విజయ అంది.

''అవును విజయా! నాన్నగారికి నువ్వంటే చాలా ప్రేమ! నువ్వు చెప్పావుగా! తప్పకుండా వెళ్తారు!'' అన్నాడు భాస్కర్.

''మీ యిద్దరూ కలిసి నన్నేమీ ఉబ్బేయక్కర లేదు!'' అన్నాడు రామనాథం పార్వతమ్మ వంక చూసి నవ్వుతూ;

తమ ప్లాను అర్థమయిపోయిందని నీరసంగా చూసుకున్నారు ఒకరి మొహాలు మరొకరు భాస్కర్ విజయాను.

''మీరు తప్పకుండా ఇవన్నీ మర్చిపోయి విశ్రాంతి తీసుకోవలసినదే! కొద్దిరోజులు యీ వాతావరణానికి దూరంగా వుండాలని నాకూ అనిపించుతోంది. ఇద్దరం వెళ్లి కొన్నిరోజులు అక్కడే వుందాం. రోజూ ఎవరో ఒకరు వస్తుంటారులెండి! ఎంతదూరం చెప్పండి?'' అంది పార్వతమ్మ.

ఎలాగయినా భర్తకి కొంత వ్యాపకాలు తగ్గించితే ఆరోగ్యం కుదుటబడుతుందని ఆమె కోరిక. రామనాథం యెటూ మాట్లాడలేక పోయాడు. ఆయనకీ కొంతకాలం ఈ వ్యాపారాల నుంచి తప్పుకుని దూరంగా వుండాలనిపించింది. అందరూ ఇంతయిదిగా చెప్తుంటే కాదనలేక పోయారు.

రామనాథం సరేనన్న తరువాత హర్షపులకిత వదనాలతో ఒకరినొకరు చూసుకున్నారు.

భాస్కర్ ఆ సాయంత్రమే తన ఉద్యోగానికి రాజీనామా యిచ్చాడు. రామనాథంగారు తమ వ్యాపారాలు కొన్నింటిని భాస్కర్‌కి అప్పగించి తన మకాం తోటలోకి మార్చుకున్నాడు. అందుకు కావలసిన ఏర్పాటులు ముందే జరిగిపోయాయి.

సుందరికి భర్త ఉద్యోగానికి రాజీనామా యివ్వటం అంత ఇష్టంలేకపోయింది. ఉద్యోగానికి వెళ్తుంటేనే కాస్తలో కాస్త మెరుగన్నట్లుగా ఇంటికి వస్తున్నాడు. వ్యాపారంలో మునిగిపోతుంటే ఇంక తన సంగతే పట్టించుకోడన్న భావం కలిగి అయిష్టాన్ని వ్యక్తం చేసింది. భార్య మాటను ఖాతరుచెయ్యలేదు భాస్కర్.

తోటలోకి వెళ్లిన తరువాత పార్వతమ్మకి ఓ వారంరోజులు బాగుగానే వున్నది. రోజూ డాక్టర్ వచ్చి చూసి వెళ్తున్నాడు రామనాథం ఆరోగ్యం ఏమాత్రమయినా మెరుగుపడిందేమోనని!

బిజినెస్‌లో చేరిన కొత్తలో రోజూ తండ్రి దగ్గరకు వెళ్లి వస్తుండేవాడు భాస్కర్ యెంత పొద్దుపోయినాను. ఆఫీసు వ్యవహారాలు యెక్కువ అయ్యేకొలదీ రెండురోజుల కొకసారి తండ్రి దగ్గరకు వెళ్లివస్తుండేవాడు.

పార్వతమ్మ బెంగంతా శ్రీనివాస్ గురించే! గాయాల నుంచి పూర్తిగా కోలుకున్నా మనిషి తేరుకున్నట్టు కనిపించలేదు. తండ్రి తోటలో మకాం పెట్టినప్పటినుంచీ కొంత స్వేచ్ఛ లభించి నట్లయింది శ్రీనివాస్‌కి. కాలేజీకి యిష్టం వున్నప్పుడు వెళ్తున్నాడు. లేనప్పుడు లేదు. చాలావరకు విజయ అతని సంరక్షణ భారాన్ని వహించింది.

భార్య కొడుకు గురించే అలా బెంగగా వున్నదని గ్రహించిన రామనాథం ఒకరోజున అడిగాడు —

''శ్రీనివాస్‌ని గురించేనా నీ బెంగంతా?''

''నీరసంగా వున్నాడు. మరీ తన ఆరోగ్యం గురించి తనకే శ్రద్ధలేదు. ఇప్పుడెలా వుంటున్నాడో ఏమో?''

''బాగానే వుంటాడులే! అదీగాక నీదగ్గిర పోయినంత గారాబంగా విజయ దగ్గిర పోలేదు. వాడికేమి కావాలో అన్నీ శ్రద్ధగా నీకంటే విజయే ఎక్కువ చూసుకోగలదు!'' అన్నాడు రామనాథం.

''వాడికసలే ముక్కుమీద వుంటుంది కోపం. సుందరి ఏమీ పట్టించుకోదు. వాళ్లిద్దరిమధ్యా ఏం గొడవలు వస్తాయో? అని నా భయం!''

''నీ సందేహం నాకు అర్థమయింది. వాళ్లిద్దరూ ఒకరినొకరు అర్థంచేసుకోవాలంటే ఇలా అప్పుడప్పుడు వాళ్లను వంటరిగా వదలి మనం దూరంగా వుండటమే మంచిది. అంతకీ విజయకి ఇష్టంలేకపోతే హాస్టల్లో వుండమని చెప్పదాం!''

''మనం చెప్పేకంటే తనంత తనే ఆ నిర్ణయం చేసుకుంటే మంచిదనిపించుతోంది. విజయ ఏమయినా అనుకోగలదు హాస్టల్లో వుండమంటే!''

''అన్నీ నువ్వే చెప్పకుంటున్నావేమిటి?''

అంటూ బిగ్గరగా నవ్వాడు రామనాథం. పార్వతమ్మ మౌనం వహించింది. అసలు ఆ భార్యా భర్తలలో వున్న విశేషం ఏమంటే ఒకరి అభిప్రాయాన్ని మరొకరికి ఇష్టంలేకపోయినాసరే గౌరవించుకోవటంలో ఒకరికి ఒకరు తీసిపోరు! శ్రీనివాస్ దుడుకు స్వభావమని పార్వతమ్మకి తెలుసు. సర్దుకుపోగల మనస్తత్వం విజయ కున్నదని ఆమె గాఢనమ్మకం.

శని ఆదివారాలలో తోటలోని బంగళాలో స్నేహితులతో గడిపే శ్రీనివాస్‌కి తల్లీ తండ్రీ తోటలో మకాంపెట్టేసరికి తన సరదాలకి ఆటంకం కలిగిందన్న బాధ కలిగింది. అదీగాక మేరీకి మరీ మరీ వాగ్దానం చేశాడు జాలీగా



తోటలోకి వెళ్ళి గడుపుదామని! ఎవరి కిచ్చిన మాటనయినా తప్పుతాడుగాని మేరీకి యిచ్చిన మాటని మాత్రం తప్పడు. మేరీకి ఇష్టంలేక పోయినా హోటల్ రూంలో ఒక రోజంతా గడిపారు.

విజయకి కాలేజీ నుంచి రాగానే స్నానం ముగించుకుని తోటలోకి వెళ్ళి పువ్వులు కోసుకుని మాలకట్టుకుని జడలో పెట్టుకోవటం అలవాటు! ఆ అలవాటు ప్రకారం తోటలోకి వెళ్ళింది.

అంతకుముందే వెళ్ళిన శ్రీనివాస్ తనముందు కార్యక్రమం గురించి ఆలోచించసాగాడు సన్నజాజి పందిరి దగ్గిర నిలబడి.

వెనుకనుంచి వచ్చిన విజయ అతన్ని చూసి తప్పుకుని ముందుకి వెళ్ళలేకపోయింది. ఈవెనింగ్ డ్రస్‌లో వున్న శ్రీనివాస్ భారీ విగ్రహాన్ని అలాగే రెప్పవాల్చకుండా చూస్తూ వుండిపోయింది.

"ఇంత అందమయిన విగ్రహంలో ఎంత రాక్షసత్వం దాగివున్నదో?" మనసులోనే అనుకుంది విజయ.

వెనుతిరిగిన శ్రీనివాస్‌కి ఎదురుగా విజయ నిలబడివుండేసరికి ఓ క్షణం యిద్దరి చూపులూ కలుసుకున్నాయి. అంతలోనే విజయ తన చూపులను దించుకుంది.

"ఏమిటలా కొరికేసేలా చూస్తున్నావు?"

దగ్గిరకు వచ్చి శ్రీనివాస్ ప్రశ్నించేసరికి విజయ తొట్రుపడుతూ తల వంచుకున్నది!

"నిన్నే?..."

# రాగబంధం

"అబ్బే! ఏమీలేదు చినబావా! ఆఁ... ఆ గులాబీపువ్వు!" సొంతం చెప్పకుండానే అతన్ని తప్పుకుని ముందుకు దూసుకుపోయింది. తన చూపులను పసిగట్టాడని; తాను శ్రీనివాస్‌కి దొరికి పోయానని భయపడిపోయి అబద్ధం చెప్పిందేగాని విచ్చిన గులాబీ పువ్వుమీద తుమ్మెద వాలివున్నది. అది చూసిన శ్రీనివాస్ దగ్గిరకు వెళ్ళి తుమ్మెద మకరందాన్ని ఆస్వాదించుతుంటే తన్మయుడై చూస్తూ వుండిపోయాడు. అలా తుమ్మెదను గులాబీని చూస్తుంటే మేరీ గుర్తుకువచ్చింది.

అంతే!

మరొక్క క్షణం వుండలేకపోయాడు. మరో అరగంటకంతా మేరీ రూంలో ఆమె మంచంమీద; ఆమె కౌగిలిలో యిమిడిపోయాడు.

ఎంతకీ భోజనానికి శ్రీనివాస్ రాకపోయేసరికి తోటలో అతని గదిలో; ఇల్లంతా వెతికింది విజయ. శ్రీనివాస్ ఎక్కడా కనిపించకపోయేసరికి యింతలోనే ఏమయ్యాడా? అనుకుంది గాని ఆఘమేఘాల మీద మేరీ దగ్గిరకు వెళ్ళాడని తెలియదు విజయకి. అలాగే చూస్తూ కూర్చుందిగాని భోజనం చెయ్యలేదు...

## 12

ఆదివారం కావటంవల్ల సుందరి భాస్కర్‌లతో పాటు తోటలోకి వెళ్ళింది విజయ. తోటను చూస్తూనే ఆశ్చర్యపోయింది. ఇంత అందమయిన తోటను తానెప్పుడూ చూడలేదు. రకరకాల పూల మొక్కలు! అన్ని రకాల ఫల వృక్షాలు! అన్ని చెట్లకూ నీళ్ళు చెరువులోనుంచి పంపింగ్ చేసేందుకు మోటార్. వున్నవి మూడే గదులయినా అందంగా కట్టించారు బంగళాను.

ఇలా చల్లని వాతావరణంలో; పచ్చని చెట్ల మధ్య ఎన్ని రోజులయినా కాలక్షేపం చెయ్యవచ్చు అనుకుంది. ఆ మధ్యాహ్నం భోజనంకి విజయని పిలవవలసివచ్చింది.

"ఏమ్మా! నీకంతగా నచ్చిందా ఈ తోట?" రామనాథం నవ్వుతూ ప్రశ్నించాడు.

"అవును మామయ్యా! ఇంటివద్ద తోట కంటే ఈ తోటే బాగున్నది. గులాబీలు ఈ తోటలో వున్నన్ని రకాలు లేవక్కడ?"

"అయితే తొందరగానే పోల్చావన్నమాట? ఈ తోటమాలిని అక్కడికి? ఆ తోటమాలిని యిక్కడికి ట్రాన్స్‌ఫర్ చేస్తే సరిపోతుంది కదమ్మా!"

"మాలిని ట్రాన్స్‌ఫర్ చేస్తే ఏముంటుంది? నర్సరీకి ఈసారి నేను వెళ్ళి రకరకాల మొక్కలు తీసుకువస్తాను!"

"అలాగేనమ్మా! నీ యిష్టం అన్నానుగా! నువ్వేం పనిచేసినా అందంగానే వుంటుందిగాని యింతకీ మీ చినబావ ఏమంటున్నాడు?" పార్వతమ్మ అక్కడ లేదని నిర్ధారణ చేసుకుని మరీ అడిగాడు.

"వేళకి భోజనానికి రావటంలేదు. రాత్రిళ్ళ

తనిష్టం వచ్చినప్పుడు ఇంటికి వస్తున్నాడు. భోజనానికి రమ్మంటే ఆకలి లేదంటాడు. అయితే నేనూ తినననంటే అప్పుడుగాని కదిలిరావటంలేదు!''

''వాడికి డబ్బు ఎక్కడిదబ్బా ?''

''అత్తయ్య వచ్చేముందు యిచ్చివుండవచ్చు! లేదా పెదబావ యిస్తున్నారేమో మామయ్యా!''

''అదే! వివరంగా తెలుసుకోమ్మా! భాస్కర్‌ని వాడికి డబ్బు యివ్వవద్దని చెప్పు! నువ్వుమాత్రం వాడికి పైసా అందించవద్దు. నేనిచ్చిన డబ్బు వున్నదిగా!''

''నేనేమీ చినబావకు యివ్వలేదు! నేను ఖర్చూ పెట్టుకోలేదు.''

''మీ అత్తయ్య కొడుకు గురించి కొత్తగా అప్పగింతలేమీ పెట్టలేదా ??''

''లేదు మామయ్యా! అయినా కొత్త విషయాలు ఏముంటాయి ?''

''అలాగని అనుకుంటున్నావా తల్లీ! ఆ ఇల్లు నీదేనమ్మా ? ఆ శ్రీనివాస్ నీవాడేనమ్మా! వాడిని జాగ్రత్తగా చూసుకోమ్మా!''

[32వ పేజీ చూడండి]

# జి.వి.జి. పేజీ

## హైద్రాబాద్ విశేషాలు

గత మాసం నేను హైదరాబాద్‌లో ఎక్కువ రోజులు గడపడం జరిగింది. "అక్బర్ — సలీమ్ — అనార్కలి, శ్రీరామపట్టాభిషేకం, చిలిపికృష్ణుడు, దేవదాసు మళ్లీ పుట్టాడు, చల్ మోహనరంగ, మంచి బాబాయ్, మొరటోడు, దూడాబసవన్న, ఆత్మీయుడు, విచిత్ర జీవితం, సూర్యచంద్రులు, మేలుకొలుపు", భాగ్యనగర్ స్టూడియోస్ వారి చిత్రాల షూటింగ్‌లతో చాలా హడావిడి కనిపించింది. అతిరథ, మహారథులందరూ హైదరాబాద్‌లో మకాం చేశారు. విజయదశమి నాడు నాలుగు కొత్త చిత్రాలకు ప్రారంభోత్సవాలు జరిగాయి. త్వరలోనే జగపతి పిక్చర్స్ అండ్ అన్నపూర్ణ స్టూడియోస్ "రామకృష్ణులు", నవశక్తి, అన్నపూర్ణ సినీ ఎంటర్‌ప్రైజెస్ వారి 4 వ చిత్రం, ప్రతాప్ ఆర్ట్స్ వారి కొత్త చిత్రం, విజయకృష్ణ మూవీస్, ఆండాళ్ ప్రొడక్షన్స్, సారథి స్టూడియోస్ వారి చిత్రాలు ప్రారంభం కానున్నాయి. రాజధానిలో ముమ్మరించిన ఈ చిత్ర నిర్మాణ కార్యకలాపాలవల్ల తెలుగు చిత్రపరిశ్రమ చాలావరకు భాగ్యనగర్‌కు తరలి వచ్చిందా అన్న అభిప్రాయం కలగక తప్పదు.

మరోవంక — ఆంధ్రప్రదేశ్‌లో చలనచిత్ర పరిశ్రమను సుస్థిర ప్రాతిపదికపై వ్యవస్థీకరించడానికి ఉద్దేశించిన ఫిలిమ్ డెవలప్‌మెంట్ కార్పొరేషన్ పునర్వ్యవస్థీకరణ, బంజారాహిల్స్ ప్రాంతంలో ఫిలిమ్ కాలనీకి అనువుగా స్థల నిర్ణయం, ప్రభుత్వాధ్వర్యాన స్టూడియో ఏర్పాటు వగైరాలతో భాగ్యనగర్‌లో తెలుగు చిత్ర పరిశ్రమ మూడుపూవు లారుకాయలుగా పెంపొందగలదన్న ఆశాభావాన్ని కలిగిస్తోంది రాష్ట్ర ప్రభుత్వం.

కాని, "తెలుగు సినిమాలిలా ఒకటి మీదొకటి వచ్చిపడుతూంటే — తెలుగు సినిమాలు చూడాలనే థ్రిల్ పోతోంది", అన్నాడొక స్టూడెంటు—తెలుగు చిత్రాల గురించి కాస్త కదిలిస్తే.

ఇంతలో మాముందు యెవరో యిద్దరు వ్యక్తులు మాట్లాడుకుంటూ వెళ్తున్నారు సినిమాల గురించే! "ఏరా ? మొన్న కొత్తగా రిలీజైన సినిమా చూశావా ?" అని ఒకతను

సీతా మహాలక్ష్మిలో చంద్రమోహన్, తాళ్ళూరి రామేశ్వరి



అడిగితే, మరొకతను "ఓ ... అదా ... దాని పని ఇంతే సంగతులు." అన్నాడు. ఇద్దరూ విరగబడి నవ్వుకుంటూ మరింత ముందుకు సాగిపోయారు.

జూబ్లీ హాలులో "దేవదాసు మళ్లీ పుట్టాడు" షూటింగ్ జరుగుతోంది. పబ్లిక్ గార్డెన్స్‌కు వచ్చిన చాలామంది ఆ షూటింగ్‌ను, తమ అభిమాన తారలను చూడాలని తహతహలాడి పోతున్నారు ఆ గుంపు చివర కొద్దిదూరంలో చెట్లకింద నిలుచొనున్న ఒక గృహస్థుని, అతని కుటుంబాన్ని చూసి, సినిమాల గురించి వాళ్ల అభిప్రాయం తెలుసుకోవాలనిపించింది. దగ్గరికి వెళ్లి ఆ గృహస్థుని పలకరించాను : "మీరు వ్యాపారులా ?"

"కాదండి. స్టేట్ గవర్నమెంట్‌లో పని చేస్తున్నాను."

"మీరు తరచు సినిమాలు చూస్తుంటారా?"

ఆయన నవ్వారు.

"ఎందుకండి నవ్వుతున్నారు ?"

"అసలు మేమీ సాయంత్రం ఏదైనా సినిమాకు వెళ్లాలనే అనుకున్నాం. మా అబ్బాయి ఒక స్టంట్ పిక్చర్‌కు వెళ్దామన్నాడు. అది లోగడ మేం చూసిన ఏదో హిందీ పిక్చర్‌కు కాపీ, ఇంకో చిత్రానికి పోదాం — అన్నది మా అమ్మాయి. మా ఆవిడ నా చెవిలో 'ఆ చిత్రానికి వద్దండి. అందులో హీరో, హీరోయిన్ మోకాళ్ళను తన మోకాళ్ళతో ఢీకొడతాడట. చూస్తే మన పిల్లలు పాడవరూ ?' అంది. మా అమ్మ "ఏదైనా పౌరాణిక చిత్రానికి పోదాం —" అన్నది. 'పౌరాణిక చిత్రాలయితే ఎటూ కొద్ది రోజుల్లో టి. వి. లో చూపిస్తారుగా ? ఇప్పుడెందుకు చూడడం ?' అని కొట్టిపారేశాడు మావాడు. నాకేం పాలుపోక మా నౌఖర్ని 'ఏరా ? నీకే సినిమా చూడాలని ఉంది ?' అని అడిగాను. 'నా సినిమా టిక్కెట్టుకు పెట్టే డబ్బులు యిలా నా ముఖాన పారెయ్యండి, బాబూ ! నా దారిన నే పోతా' అన్నాడు వాడు. ఇంతలో మా పక్కింటాయనకు ఎవరో ఏదో ఒక పాత చిత్రానికి కాంప్లిమెంటరీ టిక్కెట్లు యిచ్చారట. వాళ్ళకు మరేదో పని వచ్చిపడినందున వెళ్లడానికి వీలు కాలేదంటూ ఆ టిక్కెట్లను మాకు అందజేశాడు. మేమంతా ఆ సినిమాకనే బయలుదేరాం. 'అబ్బే ! పాత సినిమాలు ఏం బావుంటాయ్ ?' అంటూ మా అమ్మాయి, అబ్బాయి దారిలో గొడవ చేయసాగారు. పాత సినిమాలే బావుంటాయని నేను, మా ఆవిడ వాదించాం. చివరికి ఈ పూట సినిమా ప్రోగ్రామ్ కేన్సిల్ చేసుకొని యిలా చల్లగా ఈ పబ్లిక్ గార్డన్‌లోకి వచ్చిపడ్డాం" అన్నారాయన.

తెలుగు చిత్రాలు పూర్వ స్థాయిలో ప్రజలను ఆకర్షించాలంటే పూర్వంలాగే పరిమిత సంఖ్యలో వెలువడాలనే విషయం మాత్రం చాలాచోట్ల ధ్వనించింది.

## తారా జువ్వలు

★ దీపావళి రోజున కారు డ్రయివర్‌కు సెలవు యిచ్చేసిన రాజ్‌బాబు, కుటుంబసమేతంగా గుడికి కారును తనే డ్రయివ్‌చేసుకు వెళ్తూంటే ఆయన శ్రీమతి "కాస్త మెల్లగా పోనివ్వండి" అన్నారు. "ఏమిటీ! నా కారు డ్రయివింగ్‌మీద నీకు నమ్మకంలేదా ? యెలా డ్రయివ్ చేస్తానో చూడు" అంటూ రాజ్‌బాబు కారు వేగం పెంచారు. ఇంతలో వెనుకనించి కారు టయర్ బర్స్ట్ అయిన శబ్దం వినిపించింది. అయినా, రాజ్‌బాబు ఏమాత్రం తొణక్కుండా కారును సరాసరి గుడి దగ్గరికి తీసుకెళ్లి ఆపాక "చూశావా! వెనక చక్రం ఏదో బర్స్ట్ అయినా వానకు తడిసిన ఈ ఎగుడుదిగుడు రోడ్డుపై ఎంచక్కా డ్రయివ్‌చేసుకు వచ్చానో !" అని సగర్వంగా కారు దిగి వెళ్లి చూస్తే, వెనుక టయర్లు రెండూ సవ్యంగానే వున్నాయి. 'అరే ! ఇందాక టయర్ బర్స్ట్ అయిన చప్పుడు వినిపించిందేమిటి చెప్మా?' అని రాజ్‌బాబు బుర్ర గోక్కున్నా బోధపడలేదు. తర్వాత తేలిన విషయమేమిటంటే — స్టెప్నీ టయర్ బర్స్ట్ అయిందని !

★ దినపత్రిక చదువుతూన్న అల్లు రామలింగయ్య, కుర్రాడ్ని కేకేసి, "ఒరేయ్ ! కోకోకోలా బదులు కొత్తగా '77 కూల్‌డ్రింక్' వచ్చిందట. ఈ దీపావళి రోజున అదెలా వుంటుందో టేస్ట్ చేద్దాం. మేనేజర్‌గారి దగ్గర డబ్బు తీసుకెళ్లి ఆ సెవెన్టీసెవెన్ కూల్‌డ్రింక్ పట్టుకురా !" అన్నారు.

కుర్రాడు వెళ్లి కూల్‌డ్రింక్‌ల సీసాలు 77 తీసుకొచ్చేశాడు.

★ హాస్యనటుడు స్వర్గీయ రేలంగి ప్రొడక్షన్ మేనేజర్‌గా పనిచేస్తున్న రోజుల్లో జరిగిన ఒక సంఘటన... ఒక తార "రేపు దీపావళి రోజు సాయంత్రం నాకొకచోట సన్మానం జరగబోతోంది. మీ పిక్చర్‌లో నా కోసం రెండు చెప్పుల జతలు కొన్నారుగా ? అందులో ఏదో ఒక జత యిప్పిస్తే, తొడుక్కొని ఆ సన్మానానికి వెళ్లాలని వుంది" అంటే రేలంగి, "అలాగే" అన్నారు.

ఆ తర్వాత ఆ విషయం తెలిసిన నిర్మాత "ఆమె అడిగితే ఎందుకలా యిచ్చి పంపించావయ్యా ? ఆ చెప్పులను మళ్లీ ఆమె మనకు వాపసు చేస్తుందన్న నమ్మకం ఏమిటి ? ఆమెతో యింకో రోజు షూటింగ్ కూడా వున్నదికదా ?" అన్నాడు.

దానికి రేలంగి, "నేనేమంత తెలివితక్కువ వాడ్ని కానండి. ఆమె తప్పకుండా వాపసు చేస్తుంది" అన్నారు.

"ఎలా చెప్పగలవు ?" అడిగాడు నిర్మాత.

"నేను రెండూ ఆమె ఎడమకాళ్ళ జోళ్ళే పెట్టెలో పెట్టి పేక్ చేయించి, ఆమె చేతికిచ్చి పంపించాను" అంటూ పకపకా నవ్వారు రేలంగి. ★

'పంతులమ్మ'లో దీప, నిర్మల





'ఆమె కథ'లో శ్రీప్రియ, మురళీమోహన్

## తెలుగులో భారీ చిత్ర నిర్మాణం

జగపతి సంస్థ నిర్మించే చిత్రాలకు మిగతా చిత్రాలకు కాస్ట్‌లో యెంతో తేడా కనిపిస్తుంది అనేడి నిజాన్ని ప్రేక్షకులు అంగీకరిస్తారు.

ప్రేక్షకులకు కావలసిన వినోదం ... శృంగారం... సెంటిమెంటు జగపతివారి చిత్రాలలో సమంగాభాగం చేసుకుంటాయి గనకనే,ఆ సంస్థకు అపజయం జరగడంలేదేమో అనిపిస్తుంది.

## ఇద్దరు సూపర్‌స్టార్స్

అన్నపూర్ణా స్టుడియోస్ ... జగపతి పిక్చర్స్ కలిసి నిర్మించనున్న సినిమాస్కోప్ వర్ణ చిత్రం, జనవరి 20 న, అక్కినేనిగారి స్టుడియోలో ప్రారంభమవుతుంది. డిశంబర్ 18 నుంచి 25 వరకూ, మహదేవన్‌గారి సంగీత సారథ్యంలో, ఆచార్య ఆత్రేయ వ్రాసిన గీతాలను సుశీల ... బాలు ... రామకృష్ణ పాడగలరని, చిత్రంలోని ఎనిమిదింటిని రెండు జంటలపై చిత్రీకరించడం జరుగుతుందని, దర్శక ... నిర్మాత శ్రీ రాజేంద్ర ప్రసాద్ తెలిపారు.

## రామకృష్ణులు

తమిళ రచయిత గుహనాథన్ వ్రాసిన, నవరసభరితమైన కథకు, శ్రీ రాజేంద్రప్రసాద్ కథాసంవిధానాన్ని, దర్శకత్వాన్ని నిర్వహిస్తున్నారు. ఈ చిత్రానికి ''రామకృష్ణులు'' అని పేరు పెట్టారు.

చిత్రంలోని ప్రధాన పాత్రలను రామారావు, నాగేశ్వరరావు, జయప్రద, జయసుధ పోషిస్తున్నారు. అక్కినేనికి జయప్రద, నందమూరికి జయసుధ సరసాంగులు.

ఈ భారీ చిత్రానికి స్వామి, దాస్, సంజీవి, హీరాలాల్, కృష్ణారావ్, మహదేవన్ మరియు వి. బి. రాజేంద్రప్రసాద్‌గార్లు ముఖ్య సాంకేతిక సారథులు.

జూన్‌లో ''రామకృష్ణులు'' స్కోప్ వర్ణ చిత్రం అన్నపూర్ణా ద్వారా విడుదలయ్యేందుకు అనుకూలంగా, ''మే'' కల్లా షూటింగు మిగతా కార్యక్రమం పూర్తయ్యే పథకాన్ని శ్రీ రాజేంద్ర ప్రసాద్ ''ఛాక్‌అవుట్'' చేశారు.

## గోరంతదీపంలో సంగీత నాయకత్వం

బాపూ రమణల మధుర సృష్టి ''గోరంత దీపం'' అన్ని వర్గాల ప్రేక్షకుల ఆత్మీయతను మారగొనే విధంగా రూపొందుతున్నట్టు రషస్ చూచినవాళ్ళు చెపుతున్నారు.

ఈ చిత్రంలో సంగీతం నాయకత్వం వహించడమేగాక, అగ్రస్థానాన్ని ఆదే ఆర్జించుకుంటుందేమో అనేడి భావం, పాటలు బుజువు చేస్తున్నాయి.

''గోరంత దీపం'' వర్ణచిత్రంలో మోహన్ బాబుది ప్రత్యేక తరహా పాత్ర. అతని నోటంట మాటలకన్న పాటలే ప్రవహిస్తుంటాయి. అతగాడి స్నేహితుడు శ్రీధర్‌కు సహవాసబలంవల్ల పాటలపై మరింత మోహం ఏర్పడుతుంది. ఇద్దరూ పాటల పరవశంలో ఎన్నెన్నో మంచి పాటలను ఆలాపిస్తారు.

ఈ చిత్రంలో అగ్రనటితో శ్రీధర్ మొదటిసారిగా నటిస్తున్నారు. ఆమె తనకిస్తున్న ప్రోత్సాహాన్ని శ్రీధర్ మరువలేడు.

''గోరంత దీపం'' వర్ణచిత్రంలో రావు గోపాలరావు, అల్లు రామలింగయ్య, కాంతారావు, సాక్షి, ముక్కామల, సూర్యకాంతం, జి. వరలక్ష్మి, హలం, రాధాకుమారి,ఝాన్సీ, కల్పన, జయవిజయ, శశిరేఖ నటిస్తున్నారు.

సాంకేతిక శాఖల అధిపతులు అనుభవజ్ఞులవడంచేత, ''గోరంత దీపం'' చిత్రం వుత్తమ జాతి సౌరభాన్ని యివ్వగలదు.

'ఆత్మీయుడు'లో ఒక దృశ్యం



బాపు ... రమణ ... ఇషాన్ ఆర్య ... మహదేవన్ ... నేరెళ్ల రామలక్ష్మిగార్ల సమిష్టి కృషి ఫలితంగా రూపొందే యీ అందాల చిత్రాన్ని అన్నపూర్ణా విడుదల చేస్తారు.

## విశ్వనాథ్‌కు మరో కిరీటం

అవార్డు చిత్రాల దర్శకుడుగా శ్రీ విశ్వనాథ్ ప్రతి చిత్రంలోను తన ప్రతిభను బుజువు చేసుకుంటున్నారు. తెలుగు చిత్రరంగంలో వరుసగా ఎన్నో అవార్డులను ఆర్జించినది కూడా విశ్వనాథ్‌గారేనేమో !

1978 ఫిబ్రవరిలో విశ్వనాథ్‌గారి నుంచి మరో మంచి చిత్రం రాబోతూంది. యువ చిత్ర నిర్మాత శ్రీ మురారి నిర్మిస్తున్న ఆ చిత్రం పేరు ''సీతామాలక్ష్మి.''

''సీతామాలక్ష్మి'' చిత్ర నాయికగా తాళ్ళూరి రామేశ్వరిని ఎంపికచెయ్యడం యెలా జరిగింది అని నిర్మాత మురారిగారిని అడిగాను.

మా చిత్రానికి ''కొత్త అమ్మాయి కావాలి'' అని ప్రకటించాము. ''ఎందరినో టెస్ట్ చేశాము. మా కథలకు సరిపడే అర్హత రామేశ్వరికి వుందని భావించి, ఆమెను ప్రధాన పాత్రకు యెంపిక చేశాము'', అన్నారు యువ చిత్ర అధినేత.

థియేటర్ పూడ్చే యువ ప్రేమికుల జీవన సంఘటనలపై రూపొందింపబడుతున్న ''సీతామాలక్ష్మి'' చిత్రానికి అవార్డుతోబాటు ఆర్థికవిజయం చేకూరడానికి అనుకూలంగా, దర్శకుడు శ్రీ విశ్వనాథ్ వినోద ... విలాస ... మధుర దృశ్యాలను జొప్పించి, విలువయిన పాటలను ''మామ'' ద్వారా రాబట్టనున్నారు.

''సిరిసిరిమువ్వ'' చిత్రంలో చంద్రమోహన్ మోపిన బరువు ''సీతామాలక్ష్మి'' చిత్రంలోకూడా వహిస్తున్నారు. రామేశ్వరి ... చంద్రమోహన్‌ల జంట ప్రేక్షకులకు కన్నులపంట కాగలదు. ఈ చిత్రం లక్ష్మి ఫిలింస్‌కు ఆణిముత్యం కాగలదు.



'పట్నవాసం'లో ఒక దృశ్యం

# సినిమా

## కృష్ణ చిత్రాల జోరు

"దొంగలకు దొంగ" చిత్రం హీరో కృష్ణకు "సూపర్ యిమేజ్" ఆర్జించిపెట్టింది.

ప్రేక్షక లోకంలో కృష్ణ నటించిన పాత చిత్రాలకు, యిప్పుడొస్తున్న అనేక కొత్త చిత్రాలకు వచ్చే వసూళ్ల కన్న మిన్నగా వస్తున్నాయి.

ప్రస్తుతం కృష్ణతో సినిమా నిర్మించడానికి ఎందరో ప్రముఖులు నిర్ణయించారు. కానీ, ఆయన ఆగస్టు వరకు కాల్‌షీట్లు యిచ్చేశారని తెలుసుకుని, సెప్టెంబర్ నుంచి తీయడానికి ప్రిపేర్ అయ్యారు,

"మంచితనం" శాశ్వతమైన ఆభరణంగా గొన్న హీరో కృష్ణకు, అప్పుడప్పుడు అపజయాలు ఎదురయినా, ఎదుర్కొని నిలబడగలుగుతున్నారు.

ఈ రోజున ఎన్టీఆర్, ఎ. ఎన్. ఆర్. చిత్రాల లెవల్‌లో కృష్ణ చిత్రాలు జయాన్ని చవిచూస్తున్నాయి.

## వన్నోరకాల పాత్రల్లో కృష్ణ

పద్మాలయా సంస్థ నిర్మిస్తున్న "పట్నవాసం" వర్ణ చిత్రం, శ్రీ పద్మావతీ పిక్చర్స్ నిర్మిస్తున్న సినిమాస్కోప్ వర్ణ చిత్రం "దొంగల దోపిడీ", విజయకృష్ణ కంబైన్స్ నిర్మించనున్న "రౌడీ రంగమ్మ" రంగుల చిత్రం, సారథీ స్టుడియోస్ ప్రారంభించిన కొత్త వర్ణ చిత్రం... కృష్ణలోని వెరైటీ నటనకు దోహదపడే కథలు గొనివున్నాయి.

శ్రీ లక్ష్మీనారాయణ కంబైన్స్, సరోజినీ ఆర్ట్స్ చిత్రం, త్రిమూర్తి ప్రొడక్షన్స్, విజయ... మాధవీ పిక్చర్స్ ప్రారంభించే కొత్త చిత్రాలకు కృష్ణ కాల్‌షీట్లు కేటాయించినట్లు తెలిసింది. ఇవిగాక, మరో ఆరుగురికి కథలు విని, తన అంగీకారాన్ని తెలపగలనని కృష్ణ మాట ఇచ్చారు.

మారుతీ కుమార్‌గారు నిర్మించబోయే సినిమాస్కోప్ వర్ణ చిత్రంలో అక్కినేనితో కృష్ణ కలసి నటిస్తారట.

## ఇప్పటివరకు ఉత్తములు

1977 ప్రారంభమైననాటి నుంచి, అక్టోబర్ చివరిరోజు వరకు విడుదలయిన చిత్రాలలో "ఉత్తములు" ఎవరని పరిశీలిస్తే... ఈ విలేఖరికి కొన్ని స్ఫురించాయి.

ఉత్తమ నటుడుగా శ్రీ నాగేశ్వరరావును (చాణక్య పాత్ర) పేర్కొంటే ... ఎవ్వరికీ ఆక్షేపణ వుండదనుకుంటా.

ఉత్తమ నటిగా యెవరిని పేర్కొనాలి? "ఇదెక్కడి న్యాయం"లోని ప్రభనా, "చిలకమ్మ" లోని జయచిత్రనా, "ప్రేమలేఖలు" లోని జయసుధనా, "భద్రకాళి" లోని జయప్రదనా? నా ఓటు "ప్రభ"కే వేస్తాను.

దర్శకుడి విషయానికి వస్తే ... శ్రీ దాసరి (ఓ మనిషి తిరిగిచూడు) శ్రీ రాఘవేంద్రరావు (ప్రేమ లేఖలు) శ్రీ బి. ఎస్. నారాయణ (ఊరుమ్మడి బతుకులు) శ్రీ తాతినేని రామారావు (ఆలుమగలు) గార్లను సమవుజ్జీలుగా చెప్పడానికి కారణం వుంది. నేను చెప్పిన నలుగురు, వేర్వేరు కథలను, యెంతో చక్కగా, జనరంజకంగా రూపొందించిన నిజాన్ని ప్రేక్షకులు అంగీకరించగలరు.

సంగీత దర్శకులలో రమేష్‌నాయుడుగారిని, సత్యంగారిని ప్రత్యేకంగా అభినందించాలి!

హాస్యనటుడుగా "మాడా" అనూహ్యమైన "ఫాలోయింగ్"ను "చిలకమ్మ" చిత్రం ద్వారా ఆర్జించుకున్నారు.

సకలపాత్ర ప్రవీణుడుగా శ్రీ సత్యనారాయణ పేరును మాత్రమే సూచించాలి. "చాణక్య" చిత్రంలోని రాక్షసమంత్రి పాత్ర, ఆయన నటనా ప్రాభవానికి ప్రత్యక్ష నిదర్శనం.

(ఇవన్నీ ప్రేక్షకుని అభిప్రాయాలుకావు నాకు అనిపించిన నిజాలను వ్రాశాను. అంతే.)

—శ్రీనివాస్ ★

## శ్రీ శేషగిరిని నేనే!

గండుపిల్లి మొహంలాంటి మొహం, ముంతమామిడిపండులా మెలిదిరిగిన గడ్డం, తెల్లటి కళ్ళు, ఒత్తైన కనుబొమలు, నుదుట పావలాకాసంత చందనపుబొట్టు, పొట్టి మెడ. ముందరికి తోసుకొచ్చిన చిన్న బొజ్జ. బక్కపల్చంగా వున్న కాళ్ళు చేతులు — నలుగురినీ ఆకర్షించే విగ్రహమేకదూ?

కొద్దిగా నెరిసిన పొట్టి క్రాపు, హిట్లరు మీసాలు, నలభైయేళ్ల వయస్సు, చాలీచాలని గుడ్డలు, కళ్లకు చత్వారపు టద్దాలు ... నేను తరుచుగా కనిపించే వేషం యిది. యవ్వనంలో మంచి అందగాణ్ణే! నటుణ్ణి కూడా!

నా వాక్చాతుర్యానికి ఎంతటివాళ్లయినాసరే, మంత్రముగ్ధులయిపోవాల్సిందే! చేపపిల్లకు ఈత నేర్పినవాణ్ణి నేనేనంటే మీరు నమ్మితీరాలి!

నా కథ ఊళ్ళోవాళ్లందరికీ ఒక కాలాక్షేపం లాంటిది. అంచేత మీరు తీగను కదిలిస్తేచాలు, కొండంతా కదిలిపోతుంది.

అన్నానికి మొహంవాచి చచ్చేవాళ్ళున్నారు గానీ, అప్పులకు మొహంవాచిపోయే మనిషిని నేనెక్కడా చూడలేదు — నన్నుతప్ప! మీరంతా అన్నం తిని కడుపునింపుకుంటారు. నాకుమాత్రం అప్పుచెయ్యకపోతే, ఆపూట అన్నం దిగదు. మరింకేం చెయ్యమంటారండీ? చాలీచాలని జీతగాణ్ణయిపోతిని!

ఊళ్లో వున్న అన్ని దుకాణాల్లోనూ ఖాతాలున్నాయి నాకు. నాకు పరిచయమైన ఏ ఒక్కరూ నన్ను మరిచిపోలేరు. ఫలానా తేదీన యెంతో కొంత రొక్కం నాకు అప్పుగా ఇచ్చినట్లు యెక్కడో ఓచోట రాసిపెట్టుకునే వుంటారు.

ఇచ్చేవాడుండాలేగానీ, అప్పుచెయ్యటానికి జంకెందుకూ?

నా స్వగ్రామం ఇదికాదు. ఉద్యోగంలో వుండి ఊళ్లు తిరిగేవాడికి స్వగ్రామం ఏముంది? యెక్కడుంటే అదే నా స్వగ్రామం! బదిలీమీద ఈ ఊరొచ్చి మూడు మాసాలైంది.

ఈ మూడుమాసాల్లో నేను ఋణదేవత గళసీమను అలంకరించిన పూలమాలలు కోకొల్లలు!

ఇక్కడున్న అప్పులవాళ్లకే అందకుండా అల్లిబిల్లి తిరగలేక చస్తూంటే, అక్కడెక్కడో వున్న అప్పన్నపేట నుంచీ వచ్చిపడే ఈ ఉత్తరాల రాళ్లవానొకటి నా ప్రాణానికి!

ఈ ఊరు రాకముందు అప్పన్నపేటలో వుండేవాణ్ణి! అక్కడకూడా తలమునకలుగా అప్పులున్నాయి నాకు.

అక్కడుండగా, అప్పులవాళ్ల బాధ తాత్కాలికంగా ఉపశమించటంకోసం అతిత్వరలో నాకు ప్రమోషన్ రాబోతున్నదని ప్రచారం లేవదీశాను.

వచ్చింది ప్రమోషన్ కాదు; బదిలీ!

బదిలీ వచ్చిందన్న సంగతి పిట్టకైనా తెలియదు. పెళ్ళాం పిల్లల్ని అక్కడే వొదిలి వస్తూ వస్తూ అందరితో — 'పొరుగూరిలో






పన్నెండు రోజుల క్యాంపు వుంది నాకు; క్యాంపు అయిపోగానే వచ్చేస్తాను' అని చెప్పాను.

ప్రత్యేకంగా చిల్లరకొట్టు సుబ్బిశెట్టి దగ్గరికెళ్లి పై మాటలే వల్లించి, 'నేను లేకున్నా ఫరవాలేదు. నేను తిరిగి వచ్చేంతవరకు ఇంట్లో వాళ్ళకు ఏమేమి అవసరమో అవన్నీ యిస్తూ ఎప్పటికప్పుడు పద్దు రాసుకుంటూ వుండండి. నేను మళ్లీ రాగానే యిచ్చేస్తాను' అని చెప్పాను.

పదకొండోనాటి ఉదయం మావాళ్ళు అప్పన్నపేటలో లేరు!

అప్పులవాళ్ళంతా కుప్పతెప్పలుగా ఉత్తరాలు రాశారు. వాళ్ళలో సుబ్బిశెట్టి ఒకడు. అతనికి ఎందా యాభై రూపాయలివ్వాలి.

మూడు నెలలు గుక్కపట్టి ఆపైన వుండలేక జీతానికి ముందురోజే సరాసరి ఈ ఊరికి వచ్చేసి నాకోసం నక్కుతూ నడయాడుతున్నాడు సుబ్బిశెట్టి.

ఈ సంగతి నాకు తెలియదనుకున్నాడు పిచ్చినాగన్న!

చీకట్లు చిక్కగా అలుముకొన్నాయి. నేను ఆఫీసుకి ఎలా వెళ్ళానో, జీతం పుచ్చుకుని ఎలా మాయమయ్యానో — నాకు తెలుసు, ఆ పరమాత్ముడికి తెలుసు!

నాకోసం ఆఫీసు దగ్గిర పొంచిన అప్పులవాళ్ళంతా నిరాశతో వెళ్లిపోయివుంటారు, పాపం! అప్పన్నపేట నుంచి ఆవురావురుమంటూ వచ్చిన సుబ్బిశెట్టికి ఎంత ఆశాభంగమో కదా!

సందుగొందులన్నీ దాటుకుని వెళ్లిపోతూంటే — ఓ మలుపులో హఠాత్తుగా ఓ వ్యక్తి వచ్చి ఎదుట నిలబడ్డాడు. కన్ను మూసి తెరిచే లోపున జేబులో చెయ్యివేసి, డబ్బంతా ఊడ్చుకున్నాడు.

అతనే సుబ్బిశెట్టి!

'శెట్టిగారూ...' అన్నాను గుండె బద్దలైనట్లు.

'చూడండీ!... కష్టాలంటే ఏమిటో నాకూ తెలుసు! కానీ ఎన్నాళ్ళని నేనుమాత్రం సహించగలను?... ఇందులోంచి వంద రూపాయలు మాత్రం తీసుకుంటాను. మిగతా నిదానంగా యిద్దురుగానిలెండి!...' అంటూ నోట్లు లెక్కబెట్టుకోబోయాడు సుబ్బిశెట్టి.

'నా విన్నపం కూడా వినండి శ్రేష్ఠిగారూ! మీకూ భార్యాబిడ్డలున్నారు. కాస్త అర్థం చేసుకోండి. నేను యిప్పట్లో చాలా యిబ్బందుల్లో వున్నాను. వచ్చిందే తక్కువ జీతం. చాలామందికి యివ్వాలి. అందరికీ కొంచెంగానైనా సర్దుబాటు చెయ్యకపోతే, నేను తలెత్తుకు తిరగలేను. నామీద దయవుంచి పాతిక రూపాయలు తీసుకోండి. తతిమ్మా — రూపాయలణాలు పైసలతోసహా వచ్చే నెల్లో చెల్లించుకుంటాను.'

'ఇప్పుడు యివ్వలేనివాడివి వచ్చే నెల్లో ఎక్కణ్ణుంచి యిస్తావయ్యా?'

'మీకెందుకూ? నేనిస్తానంటున్నానుగా? ఇవ్వకపోతే అప్పుడు అడగండి!'

'అవసరంలేదు. మీ ప్రమాణాలు నాకు తెలియనివిగనుకనా? నేను వంద తీసుకుంటున్నాను. మిగతా తీసుకోండి!'

'నేను చెబుతుంటే అర్థం చేసుకోనంటున్నారు. తీసుకుంటే పాతిక రూపాయలు తీసుకోండి. లేకుంటే అంతా పట్టుకెళ్లిపొండి. నా అభ్యంతరం ఏమీలేదు. ఆపైన తమ చిత్తం!'

'నన్ను పూరికే విసిగించకండి. మొత్తంగా పట్టుకుపొమ్మన్నా పట్టుకుపోగలను. పేదవాడివే పాపం అన్న దయ ఒకటి అడ్డువస్తోంది. ఇక బిర్రబిగుసుకుంటే అదీలేదు. నామాట విని, యిదిగో, మిగతా తీసుకోండి!'

'వద్దండీ! తీసుకెళ్లిపొండి! పాలముంచినా, నీటముంచినా మీదే భారం!'

సుబ్బిశెట్టి ఓరిమి అంతా పటాపంచలైపోయినట్లుంది — 'సరేలెండి! నాదిమాత్రం పోయిందేముంది? డబ్బు వస్తూంటే వద్దనటానికి నేనేం బుద్ధిహీనుణ్ణి కాను. నా వందాయాభై నేను తీసుకుంటున్నా. ఇందా మిగతాది!'' అన్నాడు.

'ఎందుకులెండి! అదీ మీరే వుంచుకోండి. ఎంత మొరపెట్టుకుంటున్నా, ఆలకించనంటున్నారు. మీకు హృదయంలేదు. మీరు పదండి యిక! తెల్లవారేలోపున ఏ నుయ్యో గొయ్యో వెతుక్కుంటాను!...' ఇంచుమించు ఏడుపు మొదలెట్టేశాను నేను.

సుబ్బిశెట్టి ముఖంలో కోపమూ, అసహ్యమూ రెండూ పెనవేసుకుపోయాయి. కళ్ళు ఎర్రనైనాయి. 'ఛీ! నీ బతుకులో బుగ్గిపడ! ఈ సిగ్గులేని బతుకు యెన్నాళ్లు బతుకుతావు? తీసుకో! ఏట్లో వేసేశాననుకుంటాను...'





రాష్ట్రపతి శ్రీ నీలం సంజీవరెడ్డికి శ్రీశైలంలో పూర్ణకుంభంతో స్వాగతం ఇస్తున్న దృశ్యం. తర్వాత శ్రీ భ్రమరాంబాదేవి ఆలయంలో ప్రసాదం స్వీకరిస్తున్న సంజీవరెడ్డి దంపతులు.

## అయ్యో శేషగిరీ !

అంటూ నోట్లన్నీ నా ముఖంమీద విసిరికొట్టి, తిరిగి చూడకుండా చరచరా వెళ్ళిపోయాడు.

అతని ప్రవర్తనకు ఆశ్చర్యం, అవమానం, సంతోషం — అన్నీ ముప్పిరిగొన్నాయి నాలో.

ఎవరైనా చూస్తున్నారేమోనని అనుమానం కలిగింది నాకు ... 'నాకు తెలుసునయ్యా ... ఇటువంటి మనుషుల దగ్గిర అప్పుచేయడం ప్రమాదకరమని ! వున్నట్టుండి గొంతుమీద కూర్చుంటారు...' అంటూ కిందపడిన నోట్లను గబగబ ఏరుకున్నాను.

'ఇతగాడి డబ్బు ఎవడిక్కావాలి ? వచ్చేనెల పంపించేసెయ్యనూ ? నేనూ మనిషినే ! నాకూ వున్నాయి మానాభిమానాలు ! ...'

ఇలా అంటూ వుండగానే — ఊళ్ళోకి ప్రవేశిస్తున్న బస్సు హారను మ్రోగడం, బస్సు లైట్ల కాంతి నామీద పడటం జరిగాయి.

సింహనాదం విన్న గజరాజులా తత్తరపాటుతో పక్కనేవున్న చెత్తడబ్బా చాటుకు తప్పుకున్నాను.

ఊళ్ళు తిరిగినవాణ్ణి నేను. ఎక్కడెక్కడ ఎందరెందరు సుబ్బిశెట్లున్నారో లెక్కబెట్టు కుంటే, అదొక అంతులేని లెక్క అవుతుంది. బస్సులో అప్పులవాళ్ళెవరైనా ప్రయాణిస్తు వుంటారేమో ! ... వాళ్ళ కంటబడటం అనేది కోరితెచ్చుకునే ప్రమాదమే !

నాపైన నాకే అసహ్యం కలిగింది. నిస్సహాయమైన, నిరర్థకమైన నా జీవితంపట్ల జాలిచూపేవారెవరు ? ఏనాటికైనా ఋణ విముక్తుణ్ణయి ప్రశాంత జీవనం గడపగలనా నేను ?

వెంటనే నేను ఉలిక్కిపడేలా దరిదాపుల్లో నుంచి ఈ మాట వినిపించింది :

'అయ్యో శేషగిరీ !' అని.

చెత్తడబ్బాచాటు నుంచి యివతలికివచ్చి, చుట్టూ చూశాను.

ఎవ్వరూ కనిపించలేదు !

## రాగబంధం

[23వ పేజీ తరువాయి]

"పోండి మామయ్యా !" సిగ్గుతో తల పక్కకి తిప్పుకుంది.

"మీ సుందరి అక్కయ్య ఏమంటున్నది ??"

"ఆమె గది ! ఆమె పుస్తకాలు ! రెండవ వ్యాపకంలేదు. పెదబావకి అన్నం వడ్డించటానికి కూడా బాధపడుతుంది !"

"సరేనమ్మా ! అందరి విషయాలూ తెలిశాయి. నీకెప్పుడు రావాలనివుంటే అప్పుడే ఇక్కడికి వచ్చెయ్యమ్మా ! మరికొన్ని రోజులు వుండాలంటున్నారు డాక్టర్ !"

నిజంగా విజయకి తోటలోనుంచి తిరిగి వెళ్ళాలంటే బాధగా వున్నది. లంకంత కొంపలో రాత్రిళ్ళు వంటరిగా వుండాలంటే బాధగా వుంటోంది విజయకి. శ్రీనివాస్ యింటికి రావటానికి ఒక టైం అంటూ వుండటంలేదు. అతనొచ్చేవరకూ కాచుకుని కూర్చోవటం విజయకి కష్టంగా వుంటోంది. మేనత్తకి యిచ్చిన మాటకోసం ఓర్పు వహించుతోంది.

"డ్రైవర్ ! కారు రెడీయేనా ?"

అంటూ రామనాథం చేతికర్ర ఊపుకుంటూ ముందుకు వెళ్ళిపోయాడు. ఆయనటు వెళ్ళగానే పార్వతమ్మ తొందరగా విజయను గదిలోకి తీసుకువెళ్ళి బీరువా తెరిచి నోట్లకట్ట తీసి విజయ చేతిలో రహస్యంగా పెడుతున్నట్టు అటు యిటు చూస్తూ నెమ్మదిగా అంది —

"మీ మామయ్య అలాగే అంటారుగాని విజయా ! ఈ డబ్బు శ్రీనివాస్‌కి అవుసరం వచ్చినప్పుడు ఇవ్వు ! వాడికిమాత్రం అవసరాలు వుండవూ ?"

"ఆఁ ... వుంటాయి అత్తయ్యా ! మీలాంటి తల్లులు వున్నంతకాలం బిడ్డల అవసరాలు తీరుతునేవుంటాయి !"

"అదికాదమ్మా ! విజయా ! వాడికి స్నేహాలు; స్నేహితులు యెక్కువ ! బైట తిరిగేవాడు. పెద్దాడికంటే చిన్నవాడు కాస్త ఖర్చు మనిషి అనుకో ! చూసీచూడనట్టు వూరుకుంటే వాళ్ళకే డబ్బు విలువ తెలిసివస్తుంది. ఏమంటావు విజయా ?"

"నేనేమనేందుకు అవకాశం మివ్వేస్తేనేగా అత్తయ్యా ! చినబావని ఒకదారికి తీసుకు రమ్మనమని మీరే ఒకవైపు నాకు చెప్తూ మరోవైపు చాటుగా డబ్బు అందించి బావని మరింత విచ్చలవిడిగా తయారుచేస్తున్నారు !"

"నువ్వూ మీ మామయ్యలాగే మాట్లాడు తున్నావా విజయా ! యెంత సాధుజంతువునైనా తలుపులు బిగించి కొట్టబోతే ఎదురుతిరుగుతుంది. అవసరానికి డబ్బు ఇవ్వకపోతే వాళ్ళు మరో చెడు మార్గం పట్టే అవకాశం కన్నవాళ్ళే ఇస్తున్నారు. అవసరాలకిమించి ఖర్చుచెయ్యటం తప్పేననుకో ! అందుకే కొంతయినా యిస్తే సర్దుకుంటాడని !"

"మీరింత కష్టపడి కూడబెట్టకపోతేనేం అత్తయ్యా ? మామయ్య ఇచ్చిన డబ్బు నాదగ్గిర వున్నది. అదే ఇద్దరం వాడుకుంటాం !"

"మీ మామయ్యకి అంతా లెక్క ! ఆ డబ్బంతా నీ క్రింద వాడుకున్నావని చెప్పినా నమ్మరు మీ మామయ్య ! లెక్కలవీ అడిగి చివరికి నిన్ను కూడా కోప్పడుతారు. శ్రీనివాస్ మనసు వెన్న లాంటిది. కోపమొస్తే పాషాణం ! జాలి కలిగితే తినేదయినా తను మాని యితరులకు పెడతాడు. వాడి పొరపాట్లను సరిదిద్దుకోవలసిన బాధ్యత నీయందున్నది. వాడిని క్రమేపీ ఒక దారికి తీసుకు రావలసిన బాధ్యత నీయందున్నది. అది నీ కోసమే నని మాత్రం మరువవద్దు !"

ఆ మాతృ హృదయం శోభని అర్థం చేసు కున్న విజయ కళ్ళు చెమ్మగిల్లాయి. ఇలా అప్పగింతలు ప్రతీసారి అత్తయ్య తనకెందుకు పెడుతున్నదో అర్థమయినా మౌనం వహించింది. మేనత్తకి శ్రీనివాస్ అంటే ఎంత ప్రేమో ? మామయ్యకి అంత కోపం ! అని గ్రహించిన విజయ యిద్దరూ ఏది చెప్పినా "ఊ" కొట్టి వూరుకుంటుంది.

కారు హారన్ వినిపించగానే ఉలిక్కిపడింది

విజయ. హఠాత్తుగా ఆ గదిలోకి వచ్చిన సుందరిని చూసి యిద్దరూ తడబడ్డారు.

విజయ తన చేతిలోనున్న నోట్ల కట్టలను సుందరి కంట పడకుండా ఒడుపుగా పమిటిచెంగు చాటు చేసుకుంది. ఇద్దరూ ఏవో మంతనాలు ఆడుతున్నారని పసిగట్టిన సుందరి మొహం అరుణిమ దాల్చింది.

"ఇంకేమయినా మాట్లాడుకోవలసినవి వున్నవేమో మాట్లాడుకుని తొందరగా రా విజయా! నేను కారుదగ్గిర వుంటాను!"

ఎంత విసురుగా వచ్చిందో? అంతే విసురుతో బైటికి వెళ్ళిపోయింది.

"వట్టి అనుమానపు మనిషి సుందరి. అక్కడికి వెళ్ళిన తరువాత నిన్నేమయినా అంటే మౌనం వహించు విజయా! పోట్లాడుకోవటం మన యింటావంటా లేదు!"

"అలాగే అత్తయ్యా!"

"మీ మామయ్యకి తగ్గగానే వచ్చేస్తాం! జాగ్రత్త విజయా!" తల పంకించింది విజయ.

మాలి లోపలికి వచ్చి — "పెద్దమ్మగారు తొందరపడుతున్నారు. మిమ్మలను తొందరగా రమ్మంటున్నారమ్మా!" విజయని ఉద్దేశించి చెప్పాడు.

"పదమ్మా విజయా!"

పార్వతమ్మ ముందుకి నడుస్తుంటే విజయ అనుసరించింది. అప్పటికే సుందరి బాక్ సీటులో కూర్చుంది. రామనాథం పందిరిలో వున్న వాలుకుర్చీలో పడుకుని వున్నాడు. విజయను చూస్తూనే సరిగ్గా లేచి కూర్చున్నాడు.

"వెళ్ళొస్తాను మామయ్యా!"

"అలాగేనమ్మా! ఇక్కడ జీవు వున్నదిగా! కారు అవసరంలేదు. నీకెప్పుడు రావాలనిపించితే అప్పుడు తప్పకుండా రామ్మ! రమ్మంటున్నానని చదువుయందు అశ్రద్ధ చూపించకూ?"

"భలే మామయ్య! చదువు తరువాతనే ఏదయినాను!"

"గుడ్! అలావుండాలి!"

విజయ కారు దగ్గిరకు వెళ్లేసరికి సుందరి ముఖం తిప్పుకుని మరీ కూర్చున్నది. చిన్నగా నవ్వుకుంటూ డ్రైవర్ డోరు తెరవగానే సుందరి పక్కనే కూర్చున్నది. కారు బయలుదేరినా దారిలో ఇద్దరూ ఒకరినొకరు పలుకరించుకోలేదు. హాండ్‌బాగ్‌ని చూస్తుంటే మేనత్త అన్న మాటలు గుర్తుకువచ్చాయి. రామనాథం చెప్పిన మాటలూ గుర్తుకువచ్చాయి.

ఇద్దరు చెప్పిన మాటలకీ యెక్కడా పొంతన లేకుండా వున్నదే?

ఒకటి తండ్రి మనసు!

మరొకటి తల్లి మనసు!

మగవాడిలాగా ఆడది బిడ్డల విషయంలో నిబ్బరంగా వుండలేదు. తాను ఆ యిద్దరి బాటలనూ కలుపుకుంటూ నడుస్తున్నది. చివరికి ఈ దారి ఏ పరిణామానికి దారితీస్తుందో?

ఆలోచిస్తూనే సీటు వెనక్కి జారగిలబడి కళ్ళు మూసుకుంది విజయ. మూసుకున్న కళ్ల ముందు తన తల్లి పెంపకంలో తానెన్ని నీతులు నేర్చుకున్నదో?

"అణకువ ఆడదాని లక్షణం."

అన్న తల్లి మాట గుర్తుకువచ్చింది. మేనత్త శ్రీనివాస్‌కి డబ్బు యివ్వటంలాంటి చర్యకి కోపం వచ్చినా; తనకింత నీడను ఇచ్చినందుకు కృతజ్ఞతా వున్నది. వంటరిగా ఆ మేడలో శ్రీనివాస్‌తో అడుగడుగునా ముళ్లకంచెమీద నడుస్తున్నట్టుగానే వున్నది విజయకి. శ్రీనివాస్ మీద కోపం వున్నా; మరోపక్క ప్రేమాభిమానాలూ వున్నవి!

## 13

సుందరి పుట్టింటికి వెళ్లటంతో మరింత వంటరిదయిపోయింది విజయ. చీకటిపడుతుందంటేనే భయంగా వుండేది. విజయ ఒక్కతే వుంటున్నదని భాస్కర్ ఆఫీసు నుంచి తొందరగానే ఇంటికి వచ్చేవాడు. పని అమ్మాయిని కూడా ఇంట్లోనే వుండమని జీతం కూడా పెంచాడు భాస్కర్.

సుందరి అప్పుడే పుట్టింటికి యెందుకు వెళ్లినదో? యెంత ఆలోచించినా విజయకి అర్థం కాలేదు. భాస్కర్‌ని అడిగేటందుకు సిగ్గుపడింది.

ఒకరోజున భాస్కర్‌ని అర్జంటుగా రమ్మనమని సుందరి టెలిగ్రాం ఇవ్వటంతో హడావుడిగా కారు తీసుకుని భాస్కర్ విజయకి చెప్పి అత్తవారింటికి వెళ్లాడు.

ఆ సాయంత్రం విజయ కాలేజీ నుంచి ఇంటికి వచ్చేసరికి మేడ మెట్లు దిగుతున్న శ్రీనివాస్ మేరీని చూసి ఆశ్చర్యపోయింది. శ్రీనివాస్ కూడా సందిగ్ధంలో పడిపోయాడు విజయ కేమని సంజాయిషీ ఇచ్చుకోవాలా ? అని !

తదేకంగా వాళ్లిద్దరినీ మార్చి మార్చి చూస్తున్న విజయను కనుబొమ్మలు ఎగరేస్తూ పమిటని సర్దుకుంటూ మరింత వయ్యారాన్ని వలకబోసుకుంటూ ఒక్కొక్క మెట్టూ దిగుతూ విజయను అలవోకగా చూస్తోంది. మేరీని తప్పుకుని తొందరగా క్రిందకు వచ్చాడు శ్రీనివాస్ !

"అప్పుడే వచ్చావా విజయా ?" కంగారుగా అడిగాడు.

"ఆఁ... కాలేజీ లేకపోయినా వున్నదని అబద్ధాలాడటం నాకు అలవాటులేదు. ఎప్పటినుంచి ఇంటిలో పురాణం సాగించుతున్నావు కాలేజీ ఎగ్గొట్టి ?"

"ఇద్దరికీ ఈరోజు కాలేజీ లేదు ! కాసేపు మాట్లాడుకుందామని !"

"ఇంకెక్కడా చోటు దొరకలేదా ? సరే ! తొందరగా పంపించివెయ్యి !"

మరోమాటకి అవకాశం ఇవ్వకుండా లోపలికి వెళ్లిపోయింది. తప్పు చేసి పట్టుబడిన దొంగలా తల వంచుకుని నిలబడివున్న శ్రీనివాస్ దగ్గరకు వచ్చింది మేరీ ఆగ్రహంతో;

"ఆడవాళ్లని ఆటబొమ్మలుగా వాడుకునే నీవు ఆ అమ్మాయిని చూడగానే అలా నీళ్లుకారిపోయావేమిటి శ్రీనివాస్ ? !" అనడిగింది.

"అబ్బే ! అదేంలేదు ! లేదు మేరీ ! నువ్వింక వెళ్తావుగా ?" నుదురుకి పట్టిన చెమటను జేబురుమాలాతో తుడుచుకుంటూ అన్నాడు.

"ఆమె నన్ను పంపించమని ఆజ్ఞ జారీ చేసిందనా ?"

"అదికాదు మేరీ ?"

"పిక్చర్‌కి వెళ్దామన్నావుగా ?"

"మరొక రోజున వెళ్దాంలే !"

"అదేమీ కాదు ! ఆమె ఎవరోగాని ఒక్క మాటకే భయపడిపోయావు ! నువ్వు రానిదే నేనిక్కడనుంచి కదలనసలు !" మేరీ అక్కడున్న సోఫాలో కూర్చుంది పట్టుదలగా ! యింతవరకూ విజయమీద అథార్టీ చెలాయించుతూ వస్తున్నాడు. కాని ! యిప్పుడిక మేరీకి లొంగివుండవలసిన పరిస్థితులు తనే కల్పించుకున్నాడు.

కాని యిది తన యిల్లు !

విజయ పెత్తనం ఏమిటసలు ?

తనిష్టం వచ్చినవాళ్లతో తనింటిలో వుంటాడు !

మేరీ హేళనగా అన్న మాటలు ఒక ప్రక్క; మరో ప్రక్క విజయ హెచ్చరింపు ! శ్రీనివాస్‌ని ఎటూ ఆలోచింపనీయలేకున్నది ! అంతలో మేరీ

# రాగబంధం

సోఫాలోనుంచి లేచి శ్రీనివాస్ చెయ్యి పట్టుకుని బైటికి లాక్కువెళ్లింది.

డ్రైవర్ పళ్లబుట్ట లోపల పెట్టేటందుకు వస్తున్న డ్రైవర్ చేతిలోని తాళాలను తీసుకుని కారు దగ్గిరకు వచ్చాడు. మేరీని తన పక్కన కూర్చోబెట్టుకుని డోరు విసురుగా వేసి స్టార్టు చేశాడు.

విజయ బైటికి వచ్చేసరికి కారూ లేదు ! శ్రీనివాస్ లేడు. ఆమె చూపులను అర్థం చేసుకున్న డ్రైవర్ అన్నాడు —

"చినబాబుగారు కారు తీసుకువెళ్లారమ్మా!"

"సరే ! నువ్వింక యింటికి వెళ్లు !"

డ్రైవర్ విజయకి నమస్కరించి వెళ్లిపోయాడు. లోపలికి వచ్చి సోఫాలో కూర్చుంది. కారు వచ్చే శబ్దం కోసం చెవులు రిక్కించుకుని వింటోందిగాని ఆ శబ్దం పది గంటలకిగాని వినలేకపోయింది విజయ.

శ్రీనివాస్ లోపలికి వచ్చి కారు తాళాలు




డ్రాయర్‌మీదకి గిరవాటేసి మేడమీదకి వెళ్లిపోయాడు విజయను చూస్తూనే !

భోజనానికి పిలవటమా ? మానటమా ? అన్న సందిగ్ధంలో పడిపోయింది. శ్రీనివాస్ కోపిష్టి ! తొందర స్వభావం గల మనిషిగానే భావించిందిగాని అమ్మాయిలను వెంటేసుకుని విచ్చలవిడిగా తిరుగుతాడని ఊహించలేకపోయింది. ఇప్పుడు కళ్లారా చూసినతరువాత చాలా అసహ్యం కలిగింది.

"ఇలాంటివాడినా తను మార్చుకోవలసింది?"

"ఈ స్త్రీలోలుడినా తను వివాహం చేసుకునేది ? ?"

"మేడిపండులాగా ఏమిటి ఈ బ్రతుకులు ?"

స్థాణువులా కూర్చుండిపోయిన విజయను చూస్తూనే శ్రీనివాస్ డైనింగ్ రూంలోకి వెళ్లాడు బట్టలు మార్చుకుని ! కుర్చీని విసురుగా లాక్కుని మరీ కూర్చున్నాడు శ్రీనివాస్. తను పిలువకుండానే విజయ వచ్చి వడ్డించుతుందేమోనని యెదురు చూశాడు. ఎంతకీ విజయ రాకపోయేసరికి శ్రీనివాస్‌లో ఓర్పు క్షణ క్షణానికీ తక్కువయిపోతున్నది. పిలవాలనుకున్నాడు. అడిగి పెట్టించుకునే ఖర్మ తనకేమిటనుకున్నాడు పౌరుషంతో !

"దీనికింత గర్వమా ?"

"పిలిస్తేనేగాని పలుకదా ?"

"అనాధని తీసుకొచ్చి ఇంట్లో పెట్టుకుని ఆదరించుతున్నందుకు పొగరెక్కింది !"

"ఆ పొగరేమిటో నేనూ చూస్తాను !"

ఒక్కొక్కమాటా మనసులో అనుకుంటుంటే అంతకంతకూ కోపం; ఆవేశం ఉద్ధృతంకాగా గిన్నెమీద బోర్లించివున్న ప్లేటుని విసురుగా తోయటంతో గచ్చు నేలమీద పడి భళ్లుమంటూ శబ్దంచేసి ఆగిపోయింది. బోర్లించివున్న పళ్లాన్ని తీసుకుని గరిటతో అదికాస్త అదికాస్తా విసురుగా వడ్డించుకోవటంలో సగం పళ్లెంలోను; సగం క్రిందా పడుతోంది. మరో రెండు నిముషాలకి విజయ అక్కడికి వచ్చింది. శ్రీనివాస్ చేతిలోని గరిటను తీసుకుని కొంచెం కొంచెంగా వడ్డించ సాగింది.

విజయ ముఖభావాలు చూసి పలుకరించటానికి భయపడ్డాడు. ఆమె కనిపించకముందు యెన్నో అనుకున్నాడు. ఎదురుపడేసరికి ఏమీ అనలేకపోయాడు. ఆ గంభీర వదనం చూడగానే ఎవరికయినా అంతులేని గౌరవం ఏర్పడుతుంది.

"నువ్వు భోంచేశావా ?"

అనడగాలనుకున్నాడుగాని ఆ మాట పెదాలు దాటి రాలేదు.

విజయ ఒక పదార్థం అయిన తరువాత మరో పదార్థం వడ్డించుతుంటే భోంచేస్తున్నాడు తల వంచుకుని. మేరీ సంగతి ఏమయినా అడుగుతుందేమోనని భయపడసాగాడు. గబగబా భోంచేసి తన గదిలోకి వెళ్లిపోయాడు. శ్రీనివాస్ వెళ్లిన తరువాత తనూ వడ్డించుకుందిగాని ఒక్కముద్ద నోటిలోకి వెళ్లలేదు. తానెంతగా ఊబిలో ఇరుక్కుపోయిందో తలుచుకుంటుంటే విజయకి యెంతో బాధగా వున్నది. ఈ శ్రీనివాస్ కోసమేనా తననిక్కడికి తీసుకువచ్చింది ? ఈ స్వార్థంకోసమేనా మేనత్త తనను ఎంతో ఆదరంగా చూస్తోంది ?

మామయ్య కొడుకు గురించి ఒకరకంగా బాధపడుతుంటే తనొకరకంగా బాధపడుతోంది.

మేరీ ఆట ! మేరీ !

మేరీ వికృతమయిన హావభావాలు చూస్తుంటేనే విజయకి వంటికి కారం రాచుకున్నట్టుగా తనకి వుంటే శ్రీనివాస్ ఆమె కొంగు పట్టుకుని ఎందుకు వేలాడుతున్నాడో విజయకి అర్థం కాలేదు. తిన్నాననుకుంటూనే లేచి వెళ్లి చేతులు కడుక్కుని లైటు తీసేసి వచ్చి మంచంమీద వాలింది. మేనత్త యిచ్చిన డబ్బు గుర్తుకు వచ్చింది. అదిప్పుడే శ్రీనివాస్‌కి యివ్వకూడదనుకుంది. ఆ రాత్రి ఎంతకీ నిద్రపట్టలేదు విజయకి. తన భవిష్యత్తు ఏమిటన్నదే బాధ ? మేనత్త అనురాగం చూస్తుంటే శంకించవలసినంత అగత్యం కలుగలేదు. శ్రీనివాస్ ప్రవర్తన చూస్తుంటే విపరీతమయిన అసహ్యం కలుగసాగింది. అసలా తలంపే విజయకి అసహ్యంగా అనిపించసాగింది. అలాగని ఆలోచించకుండానూ వుండలేకపోతోంది !...

[ ఇంకా వుంది ]

# దీపావళి కథల పోటీలో రూ 600లు బహుమతి పొందిన కథ

స్కూటర్ 'షెడ్'లో పెట్టి మెల్లిగా ఈల వేసుకుంటూ ఇంట్లోకి అడుగు పెట్టాడు రామారావు

''నాన్నా! 'రాణీ' ఆంటీ వచ్చింది'' అంటూ గిరీ, లలీ ఎదురుగా వచ్చారు. వాళ్ళిద్దరూ అతని పిల్లలు.

ఎవరబ్బా, ఈ రాణి అని అతను ఆలోచించబోయేటంతలో ఆమెతో సహా ఎదురొచ్చింది సరస్వతి-అతని భార్య.

''మా క్లాస్‌మేట్ రాణీ అండీ! మీకు చెపుతూండేదాన్ని గుర్తుందా? మా అందరిలోకీ ఎక్కువ అల్లరి చేసేదని'' అంటూ పరిచయం చేసింది సరస్వతి.

''నమస్కారమండీ'' అంది రాణి.

''నమస్తే! నమస్తే! మిమ్మల్ని చూడలేదన్న మాటేగాని, మా సరస్వతి ఎప్పుడూ మీ గురించి చెపుతూనే ఉంటుంది'' అన్నాడు రామారావు

''అబ్బే! అది చెప్పేవన్నీ నమ్మకండీ! అన్నీ అబద్ధాలు'' అంది రాణి.

# అందానికి ముందూ వెనకా

''మీ మాట నిజమేననిపిస్తోంది సుమండీ, మిమ్మల్ని చూశాక'' అన్నాడు రామారావు నవ్వుతూ

''ఏం?'' అన్నట్లు చూశారు వాళ్ళిద్దరూ, అర్థంగాక.

''మరి ''రాణీ''గారు అంటే ఇంత 'అప్సరస' లాగ వుంటారు అని ఎప్పుడూ చెప్పలేదు గదా, నువ్వు?'' అన్నాడు సరస్వతివైపు చూస్తూ

సిగ్గుతో రాణి మొహం ఎర్రబడింది.

కాస్సేపయినాక, భర్తతో ఏకాంతం దొరకగానే, సరస్వతి అడిగింది, ''ఏమండీ! అంత 'అప్సరస'లా ఉందా మీ కళ్ళకి అది?'' ఆమె ప్రశ్నలో కాస్త అసూయ, కొంచెం కోపం, దాచినా దాగకుండా కనిపిస్తూ ఉన్నాయి

''ఏదో నీ స్నేహితురాలు గదా అని కాస్త ఎక్కువగా పొగిడానులేవోయ్! ఈ మాత్రానికి అంత అసూయ ఎందుకు?''

''నాకేమీ అసూయ లేదులెండి, కానీ మీ బుద్ధే ఏమన్నా మారుతోందేమోనని భయపడుతున్నాను'' అందావిడ.

అతను కాస్త కోపం నటిస్తూ, ''నా మీద అంత నమ్మకం లేనిదానివయితే అసలీ స్నేహితురాళ్ళను ఇళ్ళకు తీసుకురావడం ఎందుకు?'' అన్నాడు నిష్ఠూరంగా.

సరస్వతి మొహం ప్రసన్నంగా మారిపోయింది, ''కోపం వచ్చిందా! ఏదో వేళాకోళానికి అన్న మాటకి అంత కోపం



Interpub/GSC/2/76-R-TEL

# సింథాల్

## దుర్గంధాన్ని నిర్మూలించి తాజాదనం గల్గించే సబ్బు




చెమట వలన గలిగే శరీర
దుర్గంధాన్నుండి శక్తివంతంగా
కాపాడుతోంది.

ఏ సబ్బు పూర్తిగా వుంచనంత
తాజాగా మిమ్ములను
వుంచుతుంది.

సౌందర్య రక్షణకై చర్మ రోగ
నిపుణులచే సిఫారసు చేయబడింది.




విందుకమ్మా!'' అన్నది. అతను ఏమీ మాట్లాడలేదు

ఆమె మళ్ళా, ''అది సరేగాని, దానికి లెక్కల్లో కాస్త సహాయం కావాలిట. చేస్తారా?? అసలు మీరు లెక్కల మేష్టారని తెలిసే అది మన యిల్లు వెతుక్కుంటూ వచ్చింది'' అంది.

''సరేలే! ఇప్పటికే ఇంత రాద్ధాంతం అయింది. ఇంక లెక్కలూ అవీ చెప్పడం మొదలు పెడితే నీకెన్ని అనుమానాలు మొదలవుతాయో!'' అన్నాడు రామారావు.

దానికామె మూతి తిప్పతూ, ''పాపం ! నా గురించే భయపడిపోతున్నట్లు...'' అంది

''ఇంతకీ ఏ పరీక్షకి? ఆమె వెళ్ళేది ?''

''అదీ నాతోనే బియ్యే చదివిందని తెలుసుగా! గ్రూపులో తప్పింది. అప్పట్లో చదువు మానేసింది ఇప్పుడు మళ్ళీ బి.య్యే పూర్తి చెయ్యాలని బుద్ధి పుట్టినట్లుంది''

''సరేలే!'' అన్నాడు రామారావు, ఏదో తప్పనిసరై ఒప్పుకుంటున్నట్లుగా.

రాణీకి ఇరవై అయిదు. ఇరవై ఆరేళ్ళ వయస్సు ఉంటుంది. సరదాగా, చనువుగా మాట్లాడుతుంది. ఆమె నవ్వేటపుడు తెల్లగా మెరిసే పలు వరుస, అందంగా మెరిసే కళ్ళూ రామారావుకు అమిత ఆనందంగా కనిపించేవి. ఆమె నడిచేటపుడు ఏదో వయ్యారం, ఆ వయ్యారాన్ని మించిన హుందాతనం అతన్ని ఆమె పట్ల వ్యామోహితుణ్ణి చేయసాగాయి. ఆమెతో మాట్లాడేటపుడు అతని దృష్టి అంతా ఆమెశరీరంలో వివిధ భాగాలనూ, ఆసక్తితో అప్రయత్నంగా

## దీపావళి పోటీ కథ

చూడటంలో నిమగ్నమై ఉండేది. కళ్ళతో త్రాగుతున్నట్లుగా ఉన్న ఆ చూపులకు ఆమె తడబడి సర్దుకోవడంతోనో, లేక ఎవరైనా అక్కడకు వచ్చినపుడో, తను చేస్తున్నపని గురించిన స్పృహగలిగి దృష్టి మార్చుకునేవాడు

ఆమె వాళ్ళ ఇంటికి వచ్చిన తర్వాత ఒకనాడు అందరూ కలిసి సినిమాకు వెళ్ళారు. రామారావుకి ఒక ప్రక్క అతని భార్య రెండోవైపు పిల్లలూ, వాళ్ళ ప్రక్కన రాణీ కూర్చున్నారు. ఆట మొదలు పెట్టే ముందు రాణీ ప్రక్కన సీటులో ఎవరో మగాడువచ్చి కూర్చోవడంతో ఆమె రామారావు ప్రక్కగా వచ్చి కూర్చుంది, పిల్లలను అటు కూర్చోబెట్టి. ఈ మార్పుకి రామారావు లోపల తనకు తెలియకుండానే చాల సంతోషించాడు— ఆమె తనను పరాయి వాణ్ణిగా చూడటం లేదుకదా అని. కాని పైకి మాత్రం కాస్త ఇబ్బందిగా ముఖం పెట్టాగు భార్యవంక చూస్తూ—

సినిమా జరిగినంతసేపూ రామారావు మనసు రకరకాల బలహీనతలకు లోనయింది. రాణీ భుజం తగిలేటట్లు అటూ ఇటూ కదలడం. మళ్ళా సర్దుకున్నట్లు దూరంగా జరగడం. ఆమె అదేమీ పట్టించుకున్నట్లు కనబడకపోయేసరికి, పొరపాటున వేసినట్లు తన చేతిని ఆమెమీద వేసి వెంటనే తీసేశాడు. దానికి కూడా ఆమె ఏమీ కంగారు పడలేదు. ఇంకా ఏదయినా చనువు తీసుకునేవాడేమోగాని, ప్రక్కన తన భార్య ఉండటంతో ఊరకున్నాడు. సినిమా ఏ మాత్రమూ ''ఎంజాయ్'' చేయలేక పోయాడతను.

రామారావు ఇంట్లో వుండే సమయాల్లో చాల భాగం ఆమెకు లెఖ్ఖలు చెప్పసాగాడు. ఆమెకు కావలసిన లెక్కలన్నిటినీ తనూ శ్రమపడి సాధించి, శ్రద్ధగా బోధించసాగాడు. ఆమె బుర్ర లెక్కల్లో ఏమాత్రమూ చురుకైనది కాదని అతను ముందే గ్రహించాడు.

ఏదైనా రెండు మూడుసార్లు చెప్పాక, ''ఇంకా అర్థం కాలేదా?'' అని కాస్త విసుగ్గా అడిగేవాడు. దానికామె కాస్త సిగ్గు నటిస్తూ, ఓరగా చూస్తూ 'లేదు'' నేది. అలాంటి సమయాల్లో ఆ మొహం అంతా ముద్దులతో నింపేయాలని విపరీతమైన కోరిక కలిగేదతనికి.

అసలు ఇలాంటి అందమైన ఆడవాళ్ళకి ఈ లెక్కలూ, చదువులూ ఎందుకా? అనిపించేది. ఇలా వృధాగా కాలం గడిపే బదులు హాయిగా సంసారం చేసుకుంటే ఆమె వల్ల ఓ పురుషుడు ఎంత సుఖం పొందగలిగేవాడో ఆలోచించినపుడు అతనికి ఒళ్ళంతా వేడెక్కిపోయేది తన్నే ఆపురుషుడి జాగాలో ఊహించుకొనేటప్పటికి, ఆ ఊహల్లో ఆనందం భరించలేక మెదడు మొద్దుబారినట్లనిపించేది. రెండు రోజుల్లో అతని ధ్యాస అంతా మారిపోయింది.

తనభార్యతో తను పొందుతున్న ఆనందం ఏమీ కొత్తదనం లేనిది అన్న భావం కలిగి, నూతనానందం కోసం అతని మనసు ఉరకలు వేయసాగింది. ఇద్దరు పిల్లలు తల్లి అయిన తన భార్యను, అవివాహిత అయిన రాణితో పోల్చుకుని, ఈమెతో పొందు తనకు సమకూడరాదా అన్న కోరికతో వేగిపోసాగాడతను.

పక్కమీద పడుకుని కళ్ళు మూసుకున్న దగ్గర్నుంచీ అతని మనసునిండా ఒకటే ఆలోచనలు—రాణీ లాంటి చలాకీ యువతితో పొందు ఎంత ఉత్సాహంగా, థ్రిల్లింగ్‌గా ఉంటుందోనని ఈ రకంగా.

ఇలాంటి కోరిక అతని మనస్సులో ఎప్పుడయితే తల ఎత్తిందో అతనికి మనశ్శాంతి అనేదే కరువయింది. నీతి, నియమం లాంటి విషయాలు అసలు స్ఫురణకే రాలేదా సమయంలో. అర్హతలేని సుఖాలను ఆశించడం కష్టాలను కొనితెచ్చు కోవడమేనని తను

# మీ పాపాయికి బుద్ధి
# చెప్పినట్లే ఆ జలుబుకూ స్వస్తి చెప్పండి.
# మందలించండి, ముద్దుచేయండి.




## రబెక్స్

**అంతా మీ ధోరణిగలదే! జలుబుపై ఓ దెబ్బవేసి ముద్దుగా దూరం చేస్తుంది. ఆపైన మీ పాపాయికి ఉపశమనం, హాయి...**

# రబెక్స్

రబెక్స్‌లోని జలుబు నుండి ఉపశమనాన్ని కలిగించే విశ్వసనీయమైన ఆరు ఔషధాలు (మెంథాల్, కేంఫర్, థైమాల్, టర్పెంటైన్, యూకలిప్టస్ ఆయిల్, నట్‌మెగ్ ఆయిల్), మీరు అతని ముక్కుపై, గొంతుకపై, ఛాతీపై వీపుపై రాయగానే వేడి హాయిని వ్యాపింప చేసి ఉపశమనాన్ని కలిగిస్తాయి. రబెక్స్ త్వరలోనే అతని ముక్కు దిబ్బడను, ఛాతిలో బిగువును పోగొట్టి హాయిగా ఊపిరి పీల్చుకునేందుకు తోడ్పడుతుంది. మీతోనూ, రబెక్స్‌తోనూ మీ పాపాయిలో నవ్వులు కోకొల్లలు...త్వరలోనే.

**మంటగానీ, అంటుకు పోవడంగానీ లేకుండా జలుబుల నుండి ఉపశమనాన్ని కలిగించే శక్తివంతమైన మలాము.**

**గ్లైకోడిన్ వంటి అధునాతనమైన మందులను తయారుచేసే Alembic అలెంబిక్ ఉత్పాదన**

everest/665/ACW-tl

నమ్మిన 'ఫిలాసఫీ' అతని మనసుని 'కన్విన్స్' చేయలేకపోయింది ఒక్కసారి — జీవితంలో ఒక్కసారి కూడా అద్భుతమైన అనుభవం లేకపోవడం ఎంత నిస్సారం! అని తనలో తను వాదించుకున్నాడు. అలాంటి అనుభవానికై కొంత 'రిస్క్' తీసుకోవడంలో తప్పేముంది? అని సమర్థించుకున్నాడు.

అయినా, పాతికేళ్ళు దాటిన 'ఈమె' ఇంతవరకూ ఏమీ తెలీకుండానే ఉందా? ప్రత్యక్షంగా ఇందులో ఎవరికీ జరుగుతున్న అన్యాయం మాత్రం ఏముంది? అని తన వాదనను తనలోనే బలపరచుకో సాగాడు.

అయితే, ఈ విషయంలో ఆమె అభిప్రాయం ఏమిటో, తన పట్ల ఆమెకు కూడా అటువంటి 'ఇది' ఏమన్నా ఉందో లేదో ఆమె ప్రవర్తనద్వారా తెలుసుకోలేక పోయాడు. అతని మనసులో 'ఆశ' మాత్రం అందుకు అనుకూలంగానే సమాధానం చెపుతోంది

ఆడదాని సాన్నిధ్యం మగవాడి బలహీనత మీద ఎంత పని చేస్తుందో, కోరిక మనిషిని ఎంత కలవరపెడుతుందో అన్న విషయాలకు ఆ రెండు రోజుల అతని ఆరాటమే ఒక పెద్ద ఉదాహరణ

ఆ మర్నాడు పరీక్ష అనగా, ఆ రాత్రి పదకొండు గంటలవరకూ రాణికి లెక్కలు చెపుతూనే ఉన్నాడు రామారావు ఇద్దరూ మధ్య గదిలో చాపలమీద కూర్చున్నారు సరస్వతీ, పిల్లలూ వీధి గదిలో పడుకుని నిద్రపోతున్నారు.

## దీపావళి పోటీ కథ

ఆమె ఒక లెక్కతో తంటాలు పడుతూన్న సమయంలో అతను కాస్సేపు అలా చాప మీద ఒరిగాడు అలాగే మెల్లిగా నిద్రలోకి జారుకున్నాడు...

హఠాత్తుగా అతనికి మెలుకువ వచ్చింది అంతా కటిక చీకటిగా ఉంది వీధి లైటు వెలుతురు కూడా కనిపించక పోవడాన్నిబట్టి కరెంటుఫెయిలయిఉండాలనుకున్నాడు. తను ఎక్కడ, ఎప్పుడు పడుకున్నాడో గుర్తుచేసుకోవడానికి కొద్ది సెకన్లు పట్టింది.

"ఆమె కూడా ఈ పక్కనే పడుకుని నిద్ర పోలేదుగదా?" అన్న అనుమానం కలిగి తన చెయ్యివేసి పక్కన తడిమాడు

ఒక్కసారి అతని గుండె అతి వేగంగా కొట్టుకోవడం మొదలపెట్టింది అతని చేతికి మెత్తగా... ఆమె శరీరం. అతని మనసు అదుపు తప్పింది నిద్రలో వేసినట్లుగా రెండు మూడు సార్లు ఆమె మీద చెయ్యి వేశాడు ఆమె కేమీ మెలకువ వచ్చినట్లు లేదు. కాస్త ధైర్యం చేస్తేగాని ఎవరూ ఏదీ పొందలేరని నిర్ణయించుకున్నాడు అమె ప్రక్కకు తిరిగి పడుకుని కుడిచేతిని ధైర్యంగా ఆమె మీదవేసి జుట్టు సవరించాడు. బుగ్గలమీద మెల్లగా రాశాడు. భుజాలు నొక్కాడు.

ఆమె కదిలింది.

హటాత్తుగా చెయ్యి వెనక్కి తీసుకున్నాడు.

రెండు నిమిషాలు ఆగి మళ్ళా చేతిని అటు పోనిచ్చాడు ఈసారి ఆమె అతనివైపు తిరిగి ఇంకా దగ్గరగా పడుకుని ఉంది

అతనికి ఒక్కసారిగా ఎక్కడలేని ధైర్యం వచ్చింది తన చర్యలు ఆమెకూ ఇష్టంగానే ఉన్నాయన్నమాట ఇకనేం...

అతనుధైర్యంగా ఆమెకు దగ్గరగా జరిగి గట్టిగా కౌగిలించుకున్నాడు ఆమె నిద్దట్లోనే అతని మెడ చుట్టూ చేతులు వేసింది. కాస్సేపు ఇద్దరి మధ్యా మాటలు లేవు. అతనేదో మాట్లాడబోతే ఆమె అతని నోటిమీద చెయ్యి పెట్టి వారించింది.

కాస్సేపయ్యాక, అతను లేచి, "నేను వరండా మీద పడుకుంటాను" అని రహస్యంగా చెప్పి, తన చాప, దిండూ తీసుకుని వెళ్ళిపోయాడు.

ఆ రాత్రి అతను ఒళ్ళు తెలీకుండా నిద్రపోయాడు మెలకువ వచ్చేముందు పెద్ద కల గన్నాడు ఆ కలలో అతను దుష్యంతుడు, రాణీ శకుంతల లాగ కనపడ్డారు. తను సభలో సింహాసనం మీద కూర్చుని ఉండగా ఆమె చంకలో పసిబిడ్డతో వచ్చింది. తనను అన్యాయం చేయవద్దని పెద్ద పెద్ద డైలాగులతో అర్థిస్తోంది. నిజం దుష్యంతుడు శకుంతలని మరచి పోయాడేమోగాని, ఆ కలలో అతనికి మాత్రం ఆమె బాగా గుర్తు ఉంది. తన సింహాసనం ప్రక్కగా కూర్చునిఉన్న సరస్వతీ, పిల్లలూ అతనివైపు ప్రశ్నార్థకంగా చూస్తున్నారు. సభాసదులందరూ తనకు తెలిసినవాళ్ళు, బంధువులూ లాగానే ఉన్నారు. అందరూ తనను వేలెత్తి చూపిస్తున్నట్లూ, తనను దోషిలా భావించి గట్టిగా హెచ్చరిస్తున్నట్లూ ...

గట్టిగా సరస్వతి తట్టి లేపుతోందతన్ని అప్పటికే బాగా తెల్లవారి పోయింది

రామారావు లేచి, కాలకృత్యాలు తీర్చుకుని, కాఫీ త్రాగడానికి అలవాటు ప్రకారం వంటింట్లోకి వెళ్ళాడు. అప్పటికే ఆడవాళ్ళిద్దరూ కాఫీలు త్రాగుతూ ఏదో ముచ్చటింపు కుంటున్నారు. తనను చూసి మాటలు ఆపుచేశారు. రాణీ మొహంలోకి చూశాడతను అందులో ఏ భావమూ కనిపించలేదు.

అతను ఏ పని చేస్తున్నా తన కల సంగతే గుర్తుకు రాసాగింది ఆ కలలో



# అందరికీ తెలిసిన రహస్యమా...?



## మీరు కూడా తెలుసుకోండి.

నా విశేష పొదుపు ప్రణాళిక మీకు రెండు విధాల లాభాలను సమకూర్చుతుంది. ప్రావిడెంట్ ఫండ్, సిటిడి, జీవిత బీమా పాలసీలు మొదలైన వాటిపై మీరు పెట్టే ధనానికి, ఆదాయపు పన్ను చట్ట ప్రకారం ఆకర్షణీయమైన తగ్గింపులు లభిస్తాయి.

వీటన్నిటిలోనూ, జీవిత బీమా మాత్రమే మీరు కట్టాల్సిన పన్ను తగ్గింపడమేకాక, బీమా చేసిన రోజునుండి ఆపద రక్షణ ద్వారా మీకు ఒక ఆస్తిని కూడా చేకూరుస్తుంది.

జీవిత బీమా ప్రీమియంకు మీరు కట్టే ధనానికి సరిగా మీకు లభించే అధికాధిక పన్ను మినహాయింపు గురించి, పూర్తి వివరాలను మీ జీవిత బీమా ఏజంటునడిగి ఎందుకు తెల్సుకోకూడదు?

**జీవిత బీమాకు ప్రత్యామ్నాయం మరొకటి లేదు.**



**లైఫ్ ఇన్సూరెన్స్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా**

లాగ ఏమీ జరగదు కదా ! నిజంగానే అలా జరిగితే ...

తన కారణంగా ఒక స్త్రీ జీవితం నాశనమవడమూ, ఒక బిడ్డకు భవిష్యత్తు లేకుండా పోవడమూ జరిగితే...తనను తాను క్షమించుకోగలడా ? అటువంటి స్థితిలో తను జీవితాన్ని ఎప్పటిలా గడుపగలడా ? ఈ భయాలూ, అనుమానాలూ ఆ రాత్రి వేళ ఏమయినాయో ! ఎందుకంత వివేకరహితంగా ప్రవర్తించాడు తను ! ప్రమాదానికి తానెంత దగ్గరగా ఉన్నాడో అంచనా వేసుకోసాగాడు.

"ఏమిటండీ అంత పరధ్యానంగా ఉన్నారు?" అడిగింది భార్య.

"అబ్బే! ఏంలేదు" అంటూ రాణి మొహంలోకి చూశాడు.

"పాపం! రాత్రి చాలాసేపు మేలుకుని ఉన్నట్లున్నారు, మీరు నా గురించి" అంది రాణి.

ఆ మాటలు ఆమె నర్మగర్భంగా మాట్లాడుతున్నట్లనిపించిందతనికి.

నిజానికి ఈ విషయంలో తనెందుకు భయపడాలి? ఆమె ఆడది గనుక భయమంటూ వుంటే ఆమెకే ఉండాలి. ఇలా అనుకుంటూ హాల్లోకి వెళ్లి పడక కుర్చీలో కూర్చున్నాడు,

మళ్ళా రకరకాల ఆలోచనలు. ఆమె ఇక ముందు తనతో ఎలా ప్రవర్తిస్తుందో తనకు బాగా దగ్గర అవడానికి ప్రయత్నిస్తుందేమో! తనేం చేయాలి? కొంపతీసి నిజంగా ఆమె కేదన్నా అయితే... వాళ్ల వాళ్ళు ఆమెను బెదిరించో, లాలించో, అది ఎవరివల్ల జరిగిందన్న సంగతి ఆరాతీయరూ! అప్పుడు ఆమె తనపేరు బయట పెడుతుందా? అలా జరిగితే వాళ్ళు తనని వదిలి పెడతారా?

పోనుపోను ఇటువంటి ఆలోచనలతో అతని మనసులో పిరికితనం ఆవహించసాగింది. ఎందుకు అటువంటి పొరపాటుపని చేశానా? అని విచారించసాగాడు.

అతనలా కూర్చుని వుండగానే రాణి పరీక్షకి వెళ్లిపోయింది.

"బెస్టాఫ్ లక్" అన్నాడు రామారావు యాంత్రికంగా.

"థాంక్స్" అంది. అలా అంటూ అతని కళ్లలోకి చూసి ఆమె నవ్వినట్లుగా అనిపించిందతనికి.

"అమ్మబాబోయ్! ఈమె తనతో సంబంధం ఎంత మాత్రమూ వదులుకోదు. జరిగిందానికి ఆమె కసలేమీ భయం కూడా లేదేమో! కాని తను ఆమెతో సంబంధం కొనసాగించగలడా! అలా జరిగితే తనపరువు ప్రతిష్టలు ఏమవుతాయి? సరస్వతికి ఈ సంగతి తెలిస్తే ఆమె ఏం చేస్తుంది?" ఈరకంగా ఆలోచిస్తున్నాడు.

"ఏమండీ! ఇంకా కాలేజీకి టైము అవలేదా?" అంటూ వచ్చింది సరస్వతి.

"చాల నీరసంగా ఉందే! తెల్లకాగితం కలం పట్రా! శలవు చీటీ రాసి పంపిస్తాను" అన్నాడు.

ఆమె కొంటెగా, "నీరసమా! అవును మరి! అయినా మరీ చిన్నపిల్లలయి పోతున్నారులెండి ఈ మధ్య! లేకపోతే..."

రామారావు ఆశ్చర్యంగా, "ఏమిటే నీ వాగుడు! వాటికి అర్థం ఏమిటి?" అని అడిగాడు.

"పాపం! ఏమీ తెలీని నంగనాచి! రాత్రి కరెంటు పోగానే అది వచ్చి నన్ను లేపి పొమ్మనడమూ, నేను వచ్చి పడుకోగానే-నిద్రపోనీకుండా మీరు...నేను సిగ్గుతో చచ్చాననుకోండి ... అవతల గదిలో అది. తెలిసిఉంటే ఏమనుకుంటుందోనని!!" అంది ముద్దు ముద్దుగా చిరుకోపంతో ...

అంతే ... రామారావు హుషారుగా లేచి కాలేజీకి పోవడానికి తయారు కాసాగాడు.

# హైదరాబాద్ నోట్ బుక్ —తిరుమల రామచంద్ర

**ఆస్థానకవి అభిషేకం :**

కవితా శరధి శ్రీ దాశరథికి రాష్ట్ర అవతరణ దినోత్సవం సందర్భంగా నవంబర్ 1 వ తేదీ ఉదయం రవీంద్ర భారతిలో జరిగిన ప్రత్యేక సమావేశంలో గవర్నర్ శ్రీమతి శారదా ముఖర్జీ ఆస్థాన కవిగా అభిషేకించారు. ప్రజలకోసం, న్యాయంకోసం పోరాడిన శ్రీ దాశరథిని ఆస్థానకవిగా నియమించడం సముచిత చర్య అని గవర్నర్ అన్నారు. తర్వాత గవర్నర్ శ్రీ దాశరథిని శాలువతో సత్కరించారు. డాక్టర్ జి.వి.సుబ్రమణ్యం ప్రభుత్వం తరపున శ్రీ దాశరథికి సన్మానపత్రం సమర్పించారు. గవర్నర్ సన్మాన పత్రాన్ని రజిత పేటికలో పెట్టి దాశరథికి అందించారు. ముఖ్యమంత్రి శ్రీ వెంగళరావు ప్రసంగిస్తూ శ్రీ దాశరథి స్వాతంత్ర్య యోధుడని నిజాం వ్యతిరేక పోరాటంలో ఆయన నిర్వహించిన పాత్ర అందరికీ తెలుసునని అన్నారు. శ్రీ దాశరథి ప్రభుత్వానికి కృతజ్ఞత తెలిపారు. పిదప శ్రీ దాశరథి అధ్యక్షతన కవి సమ్మేళనం జరిగింది. శ్రీయుతులు దివాకర్ల వెంకటావధాని, బి. వి. సుబ్రహ్మణ్యం, కప్పగంతుల లక్ష్మణ శాస్త్రి, బోయి భీమన్న నాయని కృష్ణ కుమారి, జ్ఞానానందకవి, వానమామలై వరదా చార్యులు, ఊటుకూరు లక్ష్మీకాంతమ్మ, ముదిగొండ వీరభద్రమూర్తి, కేశవ పంతులు నరసింహశాస్త్రి, సలావుద్దీన్ సయ్యద్ పాల్గొన్నారు.

**రాష్ట్రపతి సందేశం :**

ఆంధ్రప్రదేశ్ అవతరణ దినోత్సవాలు నవంబర్ 1 వ తేదీన రవీంద్ర భారతిలో ప్రారంభిస్తూ గవర్నర్ శ్రీమతి శారదా ముఖర్జీ రాష్ట్రం సమైక్యంగా వుంటేనే ప్రజల సౌభాగ్యం సాధ్యమని నొక్కి చెప్పారు. ముఖ్యమంత్రి శ్రీ వెంగళరావు నాలుగేళ్ళగా రాష్ట్రం సాధించిన ప్రగతిని వివరించారు. రాష్ట్రపతి డాక్టర్ నీలం సంజీవరెడ్డి ఈ సందర్భంలో రాష్ట్ర ప్రజలకు ఇచ్చిన సందేశంలో భారత దేశ సమైక్యాన్ని దృఢతరం చేయడానికి ప్రజలు కృషిచేయాలని, సంకుచిత స్వభావాలు, ఈర్ష్యా ద్వేషాలు— లేనిపోని అనుమానాలు విడనాడాలని ఉద్ఘాటించారు. దేశ ప్రగతిని సాధించే కృషిలో నైతిక, సాంస్కృతిక ఆధ్యాత్మిక సాంస్కృతిక మూల్యాలను ఎప్పటికీ విస్మరించరాదని ఆయన ఉద్బోధించారు.

**కీర్తి కిరీటాలపై గోష్ఠి :**

శ్రీమతి యద్దనపూడి సులోచనారాణి రచించిన కీర్తి కిరీటాలు నవలపై అక్టోబర్ 29 వ తేదీన అశోక్ నగర్‌లో గ్రంథాలయంలో శ్రీ వీరాజీ అధ్యక్షతన గోష్ఠి జరిగింది. శ్రీమతి ఇల్లిందల సరస్వతీదేవి నవల ఇతివృత్తాన్ని సంగ్రహంగా చెప్పి, మానవ మనస్తత్వాన్ని రచయిత్రి బాగా విశ్లేషించి చిత్రించారని అన్నారు. శ్రీ వీరాజీ తమ ప్రసంగంలో ఏది చెప్పడం, ఎలా చెప్పడంపై రచయిత విజయం ఆధారపడి వుంది, ఈ కిటుకు సులోచనారాణికి బాగా తెలుసు. కీర్తి కిరీటాలు తక్కిన ఆమె నవలన్నిటికీ కీర్తి కిరీటం. మామూలు నవల శిల్పంవేరు. సీరియల్స్ శిల్పంవేరు. అన్నారు. శ్రీ చంద్రమవుళి తమ ప్రసంగంలో కీర్తికిరీటాలలోని పాత్రల లోను, సన్నివేశాలలోను వాస్తవికత లేదని, పాత్రలలో కళకోసం తపనలేదని, కథానాయకుడు విలన్ కావడం అవాస్తవికమని అన్నారు. శ్రీ పోతూకూచి సాంబశివరావు స్వాగతం చెప్పారు.

**'సహజీవనం' నృత్య నాటికల సంపుటి ఆవిష్కరణ :**

రసమయి యాజమాన్యాన అక్టోబర్ 27 వ తేదీన రవీంద్ర భారతిలో జరిగిన సమావేశంలో రసమయి కార్యదర్శి శ్రీ ఎం. కె. రాము రచించిన నృత్య నాటికల సంపుటి సహజీవనంను డాక్టర్ సి. నారాయణరెడ్డి ఆవిష్కరిస్తూ, శ్రీ రాము, నృత్య నాటికా రచనలో గణ్యత పొందుతూ, రంగస్థలంమీద గజ్జ కట్టిస్తున్నారని ప్రశంసించారు, శ్రీ రాము కవిత్వంలో సంగీతం నృత్యం చేస్తుంటుందని, సమావేశానికి అధ్యక్షత వహించిన శ్రీ బోయిభీమన్న కొనియాడారు. పి.శ్రీరాము సహజీవనంను జంట నగరాల విద్యాశాఖాధికారి శ్రీ శ్రీ డి. సి. వెంకట సుబ్బన్నకు అంకితమిచ్చారు. శ్రీ వెంకట సుబ్బన్న రచయితను దుశ్శాలువలతో సత్కరించారు. ఆంధ్ర బ్యాంకు పబ్లిక్ రిలేషన్స్ ఆఫీసరు శ్రీ కె. వి. భాస్కరరావు శుభా కాంక్షలు అందజేశారు. సాంస్కృతిక కార్యక్రమం తర్వాత శ్రీమతి ఆశాలత వందన సమర్పణ చేశారు. ప్రారంభంలో సుప్రసిద్ధ నర్తకి శ్రీమతి సుమతీ కౌశల్ స్వాగతం పలుకుతూ, నృత్య శిఖరకోసం ఒక నృత్య నాటికను రచించి ఇవ్వాలన్నారు.

**కళాకారుల సంక్షేమ నిధి :**

వయోవృద్ధులైన కళాకారులకు సహాయం కోసం సంక్షేమ నిధిని నెలకొల్పాలని రాష్ట్ర గవర్నర్ శ్రీమతి శారదా ముఖర్జీ నవంబర్ 1 వ తేదీన ఫిలిం అవార్డుల ప్రదానోత్సవసందర్భంలో అన్నారు. లాల్ బహదూర్ స్టేడియంలో ఈ ఉత్సవం జరిగింది. ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు, ఫిలిం అవార్డు కమిటీ అధ్యక్షుడు శ్రీ పి. జగన్మోహన్‌రెడ్డి, సమాచార ప్రసారశాఖ మంత్రి శ్రీ మాణిక్‌రావు ప్రసంగించారు. ప్రత్యేక సంచికను డాక్టర్ బెజవాడగోపాలరెడ్డి ఆవిష్కరించారు.

**ఉపశ్రుతి :**

ఏమిటి గంట ఆలస్యమయినా సభాధ్యక్షులు రాలేదే ? అన్నాను ఒక సాహిత్య సమావేశంలో సాహిత్యం కాలాతీతం గదండీ, సర్వకాలాలకూ వర్తిస్తుంది. కనుక సాహిత్య సభలకు వచ్చేవారు ఆలస్యంగా వస్తే ఏమ్ ? అని ప్రముఖ రచయిత్రి శ్రీమతి లత ఎదురు ప్రశ్న వేశారు.

## చేసిన పరీక్షల వలన తేలింది...





# రుచికీ, విటమిన్లకూ, పుష్టికీ బిస్కట్ అంటేనే ఇది

## బ్రిటానియా గ్లూకోజ్-డి



బ్రిటానియా గ్లూకోజ్–డి బిస్కట్లతో పాటు మరో ప్రముఖ బ్రాండ్ గ్లూకోజ్ బిస్కట్లను పోల్చి చూసేందుకు చేసిన పరీక్షల వలన తేలిందేమిటంటే: విటమిన్లు మరియు మొత్తం మీద పుష్టినిచ్చే పదార్థాలు గ్లూకోజ్–డిలో ఎక్కువగా ఉన్నాయని. అంతేగాక రుచికోసం, తియ్యదనం కోసం, కరకరలాడే తనానికి దీనిని కావాలంటారని. శక్తినిచ్చే విషయంలో, గ్లూకోజ్ కన్న గ్లూకోజ్ డి 20% ఎక్కువ శక్తినిస్తుంది!

<u>బ్రిటానియా గ్లూకోజ్–డి–తియ్యటి రుచితో కూడిన శక్తి !</u>




అందుకే మరి ఏ ఇతర గ్లూకోజ్ బిస్కట్ కన్న బ్రిటానియా గ్లూకోజ్-డి అంటేనే ఎక్కువ మంది ఆకర్షితులవుతున్నారు.

బ్రిటానియా బ్రిటానియా బిస్కట్లు అత్యుత్తమమైనవి

లింటాస్-B3C.GL-10-140 TL

# వారఫలం

— మహేష్ —

25–11–1977 శుక్రవారం మొదలు
1–12–1977 గురువారం వరకు

**మేషం:—** నూతన వ్యవహారాలు బాగుంటాయి. రావలసిన డబ్బు అందుతుంది. వృత్తిలో పోటీవారి పోటీ తగ్గుతుంది. రాజకీయ వ్యవహారాలు బాగుంటాయి. ఆర్థిక వ్యవహారాల్లో మొహమాటాలు తగవు. స్త్రీలకు :— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి దైవకార్యాలు నెరవేరతాయి.

**వృషభం:—** ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది. ప్రయాణాలు ఫలిస్తాయి. వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కలుసుకొంటారు. విద్యావైజ్ఞానికరంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి. స్త్రీలకు :— ఆరోగ్యం బాగుంటుంది. సంతోషకరమైన వార్తలను వింటారు.

**మిధునం:—** సాహసిక వ్యవహారాల్లో నష్టం వస్తుంది. ఫలితంలేని శ్రమ కలుగుతుంది. వారం మధ్యలో మీ కార్యక్రమాలు బాగుంటాయి. వ్యాపారంలో ఆదాయం పెరుగుతుంది. ప్రయాణాలు అనుకూలంగా ఉంటాయి. స్త్రీలకు :— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. అధిక వ్యయం జరుగుతుంది.

**కర్కాటకం:—** మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. నూతన వ్యవహారాలు లాభిస్తాయి. వారంమధ్యలో చికాకులు యేర్పడతాయి. మీ తాలూకు వస్తువులు పోవచ్చును. వారం ఆఖరులో అన్ని వ్యవహారాలు తిరిగి బాగుంటాయి. స్త్రీలకు :— ఆరోగ్యం బాగుండదు. సాహిత్యకళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

**సింహం:—** అన్ని వ్యవహారాల్లోను గౌరవం బాగుంటుంది. ప్రయాణాలు ఫలిస్తాయి. వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. రావలసిన డబ్బు అందుతుంది. వారం ఆఖరులో మీ తాలూకు మనుషులుకూడా మిమ్మల్ని వ్యతిరేకిస్తారు. స్త్రీలకు: కుటుంబ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. బంధుమిత్రులను కలుసుకొంటారు.

**కన్య:—** అనుకూలమైన వార్తలను వింటారు. రావలసిన డబ్బు అందుతుంది. స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి. వ్యాపారంలో ముఖ్యముఖ్యమైన వ్యక్తులను కలుసుకొంటారు. మీరు ఇదివరకు చేసిన ప్రయత్నాలు ఫలిస్తాయి. స్త్రీలకు: ఆరోగ్యం బాగుంటుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**తుల :—** ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. ఆందోళన కలుగుతుంది. వారం మధ్యలో ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. విద్యావైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. ప్రయాణాలు ఫలించగలవు. స్త్రీలకు :— కుటుంబవ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. దైవకార్యాలు నెరవేరతాయి.

**వృశ్చికం:—** మీ ఆలోచనలు ఫలిస్తాయి. ప్రయోజనంగలవ్యక్తులను కలుసుకొంటారు. వారంమధ్యలో ప్రయాస కలుగుతుంది. సాహసిక వ్యవహారాల్లో నష్టం రాగలదు. వారం ఆఖరులో మీ కార్యక్రమాలు అనుకూలంగా ఉంటాయి. స్త్రీలకు :— ఆరోగ్యం బాగుండదు వినోదకార్యక్రమాల్లో పాల్గొంటారు.

**ధనుస్సు:—** అనవసరమైన సందేహాలు కలుగుతాయి. వ్యాపారంలో పోటీవారి పోటీ పెరుగుతుంది. ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది. రావలసిన డబ్బు అందుతుంది. వారంఆఖరులో చేజిక్కిన అవకాశాలు కూడా జారిపోవచ్చును. స్త్రీలకు :— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. దైవకార్యాలు నెరవేరతాయి.

**మకరం:—** మీ కార్యక్రమాలు నిరాటంకంగా నెరవేరతాయి. నూతన వ్యవహారాలు లాభిస్తాయి. పోటీవారితో వాదప్రతివాదాలు తగవు. రాజకీయ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు లాభిస్తాయి. స్త్రీలకు :— ఆరోగ్యం బాగుంటుంది సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి.

**కుంభం:** మీ మంచితనమే మీకు ఇబ్బందిని కలిగించగలదు. పోటీవారిలో గౌరవం లభిస్తుంది. వృత్తిలో ఆదాయం బాగుంటుంది. సాహసిక వ్యవహారాలు లాభిస్తాయి. ఇతరుల నిమిత్తం శ్రమ పొందవలసి వస్తుంది. స్త్రీలకు :— పుణ్యకార్యాలు చేస్తారు. శుభ కార్యాల విషయంలో అనుకూలత లభిస్తుంది.

**మీనం:—** వ్యాపార విస్తరణ ప్రయత్నాలు బాగుంటాయి. మిత్రులకు సహాయం చేస్తారు. ఆర్థిక వ్యవహారాల్లో మొహమాటాలు తగవు. ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది. విద్యావైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. స్త్రీలకు :— ఆరోగ్యం బాగుంటుంది. నూతన విషయాలను తెలుసుకొంటారు. ★



# తెల్ల జుట్టు, జుట్టుకు వేసే రంగుల గురించి మీ మూఢ నమ్మకాలన్నిటినీ తేలికగా కొట్టివేస్తున్నది గోద్రెజ్

**జుట్టు తెల్లబడడం సహజం**

అవును, నిశ్చయంగా. కాని తెల్ల జుట్టును అలాగే వదిలేయడం మాత్రం అసహజం ఎందుకంటే, గోద్రెజ్ వారు జుట్టుకు రంగు వేసుకోవడాన్ని షాంపూ చేసుకోవడమంత సహజంగా, అంతే సులభంగా, రూపొందించారు.

**తెల్ల జుట్టు ఉంటే 'కొట్టవచ్చినట్టుగా' కన్పిస్తుంది!**

తెల్ల జుట్టు 'కొట్టవచ్చినట్టుగా' కన్పించడమే కాదు, అందువల్ల మీరు ఏళ్లు పైబడినట్టుగా కూడా కన్పిస్తారు. కావలిస్తే మీ స్నేహితుల నడగండి.

**ఎవరంత కష్టపడి జుట్టుకు రంగు వేసుకుంటారు?**

ఎవ్వరూ చెయ్యరు. అందుకే గోద్రెజ్ వారు తనంతట తానే వ్యాపించే హేర్ డైని మీకందిస్తున్నారు. ఎంతో శ్రమపడి జుట్టును విడదీసి రంగు వేసుకోనక్కర్లేదు. మీరు చెయ్యవలసిందల్లా ఈ హేర్ డైని జుట్టుకు పట్టించి నురుగు వచ్చేలా రుద్దడమే. కాస్సేపు ఆగి తరవాత దాన్ని కడిగి వేయాలి ఎంతో సులభం కదూ!

**రంగు వేసుకోవడం వల్ల జుట్టుకు హాని కలగదా?**

కొన్ని పాత రకం హేర్ డైల వల్ల తప్పకుండా హాని కలగవచ్చు. అందుకే గోద్రెజ్ హేర్ డై ప్రత్యేకంగా రూపొందించబడింది దీనిలోని 'హేర్ కండిషనర్' వల్ల మీ జుట్టు ఆరోగ్యంగా నిగనిగలాడుతూ ఉంటుంది.

భారతదేశపు మొట్టమొదటి తనంతట తానే వ్యాపించే హేర్ డై!




## గోద్రెజ్

పర్మనెంట్ హేర్ డై

—జుట్టుకు రంగు వేసుకోవడంలో 'శ్రమ' లేకుండా చేస్తుంది. అందుచేత, దీనితో మీరు మీ వయస్సును తగ్గించుకోవచ్చు.

పురుషుల కోసం
మరియు స్త్రీల కోసం
2 రంగుల్లో:
సహజమైన నలుపు
గాఢమైన గోధుమ రంగు.

CASGS-109 244 TEL

వనితలకు మనవి

కొత్తరకం వంటలు
క్లుప్తంగా వ్రాసి పంపితే
త్వరగా పరిశీలించ వీలు —సం.







# ప్రశ్నావళి

## కె. రామలక్ష్మి

విజయభాస్కర్ – ఖైరతాబాద్

మీ ఉత్తరాలు చదవడానికి సరదాగా ఉంటాయి.

కాస్త ఆలోచిస్తే ఆ సరదా వెనుక బాధా కోపం, ఉడుకుబోతుతనం, పౌరుషం — అన్నీ కూడా కన్పిస్తాయి.

టి. వి. కొత్తగుంట

చాలా పత్రికల్లో ఆడవాళ్ళు మగవాళ్ళమీద చూపాలనుకునే అధికారయుత కార్టూనులు వేస్తుంటారు. వాటి ఉద్దేశ్యం?

ఉద్దేశ్యం లేదు. ఏంలేదు. మన కార్టూనిస్టుల బుద్ధివైశాల్యానికవి చిహ్నాలు మాత్రమే. అప్పడాల కర్రా ఆడదీ, అంట్లూ మగవాడూ తప్పించి ఉన్నతంగా వూహించలేరు....

కె. కె. అమలాపురం

మీకు నిజంగా దేవుడు ప్రత్యక్షమై ప్రశ్నావళి చదువుతున్నాను ఏం బాగాలేదు అంటే?

రంభాదుల డాన్సు చూస్తూనో, శ్రీవాన్ సినీ కబుర్లు చదువుతూనో చదివితే అలాగే ఉంటుంది! నా పక్కనే ఉన్న యముల్నాణ్ని చూడు — పళ్ళు పటపట కొరుకుతూ ఎంత హాయిగా ప్రశ్నావళి చదువుతున్నాడో చూసైనా నేర్చుకో వద్దా? అంటాను.

ఎ జె కె - నిజామాబాదు

మీరు ప్రశ్నలకు జవాబులు యివ్వడం చూస్తే, మీరు మగవారై పుట్టి ఉంటే బాగుండునని పిస్తుంది.... ఏమంటారు?

నిజమే — ఆడవారిని సాటి మనుషులుగా గౌరవిస్తూ — సమ ఉజ్జీలుగా భావిస్తూ — ఈ సంఘంలో మగవాడు ఎలా మసలాలో—చక్కని ఉదహరణనై నిలబడేవాణ్ని !

ఎస్. ఎన్. వెంకటగిరి

మనస్సంటే ఒకగాజు. మరి ప్రేమంటే ?

ఆ గాజు పాత్రలోపడి సూర్యకాంతికి వన్నెలు చిమ్మే రంగుల వల ప్రేమ.

వై. ఎస్. ఎల్. పిడి., — హైదరాబాదు

తన భార్యాబిడ్డల సుఖంకోరి కేవలం ఆఫీసుకి యింటికి అంకితం అయిపోయిన మగవాడిని ఏమనాలి ?

మహా త్యాగి అందాం ! తప్పేముంది ? తన పెళ్ళాం పిల్లలకోసం పాటుపడ్డం వూరికి వుపకారం చేసినంత బాధపడ్డం దేనికి ? ఏ మనిషి స్వార్థానికి —పనిచేసినట్టు యింకా దేనికి చేయడు. యిది సత్యం.

జె. వి. ఎస్ — విశ్వేశ్వరపురం

వేడికన్నీటి హింస, చల్లటి కన్నీటి ప్రేమకు జన్మస్థానములు కష్ట సుఖాలకు కారణమైన వేధన్ను మానవునికే యివ్వబడింది. దానిని మెదడుగానే వుపయోగించాలి నా లేత హృదయ శాంతి పీఠము ప్రపంచ విపులకాలం. నిరవవరధ్భ పువ్వులలో నేనొక పువ్వుని. ఆకులలోనేనొక ఆకుని. మనమధ్య శాంతి సరస్సు!

బాబోయ్ విజయశ్రీ రక్షించు! యిదేదో కోడూరి (అరికెపూడి) నవలలో హీరోయిన్ మన స్సులో మాటలాగా వుంది!!

ఆర్. ఎల్ — విశాఖపట్నం

వైవాహిక జీవితం నచ్చలేదని తెలిసి దానికి కట్టుబడి వుండడం సాధ్యమా?

సాధ్యమా? అన్నది కాదు స్త్రీలు తేలుకోవలసినది. అవసరమా? అన్నది తేల్చుకోవాలి పిల్లలకోసం యితర అవసరాలకోసం పడి వుండడం, సర్దుకుపోవడం తలవంచడం, కాదు సంసారం అన్నాక యిద్దర్లూ, పడివుండక, సర్దుకుపోక, తలవంచక తప్పదు. కానీ, ఎప్పుడూ బాధ్యతల బంధాలని ప్రేమ సంకెళ్లుగా ఆరాధించి, పిల్లలని పెంచి పెద్ద చేయాలన్న తపనతో అన్నిటికి తలవంచే స్త్రీయే పడివుండే పరిస్థితికి దిగజారడం ఎందువల్ల అన్నదీ నాడు తలెత్తుతున్న ప్రశ్న కారణం లేకుండా సంసారంలో సహించలేని పరిస్థితి ఏర్పడ్డప్పుడు, దాన్ని పట్టుకు వేలాడటం దండుగే యింకోదారి తెలియని స్త్రీలు యీ నరకంలో పడి వుండక తప్పడంలేదు.

డి. ఎల్. ఆర్ — ఇబ్

ఏమండీ భర్తసుకొట్టే ఆడదాన్ని ఏమనాలి?

కొట్టిన సందర్భాన్ని పట్టి వుంటుంది. అనవలసినది. అయిన భార్యాభర్తలు కొట్టుకొంటే మధ్య మన పెద్దరికం దేనికి? వాళ్ళు తేల్చుకోరా?

కె.ఆర్.ఎస్.ఆర్ — హైదరాబాదు

నేటి చలన చిత్రాలు మన సంస్కృతిని సంప్రదాయాన్ని పరిరక్షిస్తున్నాయా? పాడు చేస్తున్నాయా?

అసలు ఏది మన సంస్కృతి? ఏది మన సంప్రదాయం అది చెప్పండి ముందు! ఎవరికి పట్టని వీటిని చలన చిత్రాలు ఎందుకు పనికట్టుకు ఉద్ధరించాలి?

పి. వి. ఆర్; పి. వి. ఎస్. ఆర్.

యాదగిరిగుట్ట

నవ్వే ఆడదాన్ని ఏడ్చే మగవాడిని నమ్మకూడదని! అంటారు. ఎందుకు?

బహుశా నవ్వే ఆడది ఏడ్చే మనస్సుని, ఏడ్చే మగవాడు శిలా హృదయాన్ని దాచి వుంటారు లోలన అని!

జె. సి. హెచ్ ఆర్. బిట్రగుంట

మీరు ఆర్టిస్టుల జీవితం గురించి వ్రాయడం చూశాను. నాకూ చిత్రలేఖనంలో ప్రావీణ్యం వుంది. పిల్లలను ఉచితంగా డ్రాయింగు నేర్పే పాఠశాలలుంటే తెలుపగోరుతాను.

హైదరాబాదులో ప్రభుత్వం ఆధ్వర్యంలో నడిచే స్కూల్ ఆఫ్ ఆర్ట్స్ వుంది. ఉచితంగా చెప్తారో లేదో గాని, ఉచిత వేతనాలు యిస్తూ వుంటారు. కనుక్కోండి. అయినా ప్రావీణ్యం కలవారికి ప్రాక్టీసు కావాలి గాని స్కూళ్లెందుకు?

# మర్యాద లోపం

మెక్డొనాల్డ్ చౌల్ట్రీ అనే వూరికి చెందిన 22 ఏళ్ళ చిన్నణ్ణన్ అనే అతనికి మూడునెలల క్రితం 15 ఏళ్ళ శివకామి అనే అమ్మాయితో వివాహమయ్యిందట. శివకామితో ఆమె పుట్టింటివారు చేసిన మర్యాదలోపాలను గురించి తల్లీకొడుకులు రోజూ ఏకరువు పెట్టేవారట. వోనాడు యిలా చెప్తూ, చెప్తూ, ఆవేశం వచ్చి ఎర్రగా కాల్చిన యినుపకడ్డీతో చిన్నణ్ణన్ గబగబ శివకామి ఒంటి నిండా వాతలు పెట్టాడట. ఈ విషయం పోలీసులకు తెలిసి స్పృహతప్పిన ఆమెను ఆసుపత్రిలోను, అతనిని, అతని తల్లిని, యిద్దరన్నలను పోలీసు స్టేషనులోను చేర్చారట.

## డబ్బుకోసం దారుణ హత్య

పల్లిపాలయం అనే వూరుకు చెందిన రాజేంద్రా టెక్స్‌టయిల్స్ అనే బట్టలషాపులో గుమాస్తా పని చేస్తున్న కృష్ణస్వామి వసూళ్ళకోసం తిరుచ్చివెళ్ళి పార్టీలవద్ద పదివేలు నగదుగాను, పదమూడువేలు డ్రాఫ్టు [illegible]గాను తీసుకుని వూరుచేరడానికి తిరుచ్చి బస్‌స్టాండు [illegible]రాడు. అప్పుడు సమయం రాత్రి తొమ్మిదయిందట. బస్టాండులో పల్లిపాలయంకు చెందిన 23 ఏళ్ళ మాదిష్ అనే పందిళ్ళకాంట్రాక్టు కుర్రాడాతన్ని పలకరించి నువ్వు వూరికేగా! యిద్దరం కలిసి కారులో పోదాంపద. టాక్సీ వేరుగా మనూరు

# ఘాతుకుని డైరీ

వైపు బయల్దేరుతోంది అన్నాడట. కృష్ణస్వామి సరేనని బయల్దేరాడట. ఆ టాక్సీలో అప్పటికే యింకో ముగ్గురున్నారట. టాక్సీ ఉత్తమర్‌కోవిల్ అనే వూరు రైలుగేటు దగ్గర కొచ్చేసరికి పక్కన కూర్చున్నవాడు క్రిష్ణస్వామి మీదపడి, అరవకుండా నోరుమూసి, తాడుతో పీకబిగించి చంపేసి, శవాన్ని రోడ్డువారగా లాగేసి పారిపోయారట. భర్త యింకా యిల్లు చేరలేదేమని అతనిభార్య పోలీసుల కిచ్చిన రిపోర్టువల్లాతని శవం ఆమెకు చేరిందట—హరిహరీ!

## భార్య వేళాకోళం—భర్త ఆత్మహత్య !

సేలం అమ్మపేటకు చెందిన 21 ఏళ్ళ సుబ్రహ్మణ్యం అనే కుర్రాడికి అతని అక్క కూతురు 21 ఏళ్ళ పచ్చయ్యమ్మకు నాలుగునెలల క్రితం పెళ్ళి అయ్యిందట. ఆనాటినుంచీ పచ్చయ్యమ్మ అతన్ని ఏదోఒకరకంగా వేళాకోళం చేస్తూనే వున్నదట. ఇదంతా, పోన్లే అక్కకూతురు కదా అని వూరుకున్నా రాన్రాను అతనికి సంకటమయ్యిందిట. హెచ్చరించినా కూడా ఆమె తన నైజం మానుకోలేదట. దాంతో అతను ఆమె చేసే వేళాకోళానికి, అపహాస్యానికి— అవమానానికీ తట్టుకోలేక వోరాత్రి వేళ ఆరోజు రాద్ధాంతతో బుర్ర తిరిగి, పడగ్గదిలోనే దూలానికి వురిపోసుకు చనిపోయాడట. రాత్రి మంచినీళ్ళకని లేచిన అతని అక్కగారు వారి గది తలుపు తీసుందేమని చూసి కెవ్వున కేకవేసిందట ఆ కేకకు చుట్టుపక్కలవారూ, కూతురూ కూడా లేచారుట అయినవారంతా అతనిశవం మీద పడి విలవిలా ఏడ్చారుట అంతేకదా మరి!

## అప్పులబాధ భరించలేక ఆత్మహత్య చేసుకున్న దంపతులు

పరమత్తి అనే వూరుకు చెందిన 25 ఏళ్ళ పెరియసామి అదేవూరుకు చెందిన 21 ఏళ్ళ పాపాయి అనే అమ్మాయి పరస్పరం ప్రేమించుకుని విడిగా యిహ బ్రతకలేమన్న నిశ్చయానికి వచ్చేశారట దీనికి వారి తలితండ్రులు సుతరామూ ఒప్పుకోనందువల్ల వారిని ఎదిరించి పెళ్ళి చేసేసుకుని విడి కాపురం పెట్టేశారట. కానీ ఏ వుద్యోగమూ లేనందువల్ల, దొరకనందువల్లా యిహ కూలిపనికి వెళ్ళనారంభించారట. వారికో ఆడపిల్ల పుట్టిందట ఆ పిల్లను వారు మనస్సులో వూహించుసట్లు పెంచలేక, అప్పులు ఎక్కువై, అయిన వారిని యాచించడానికి మనస్సు ఒప్పక, గచ్చపప్పునూరుకు తినేసి తనువు చాలించారట. వారు చనిపోయాక వారి తలిదండ్రులు వచ్చి భోరున వారి శవాలమీద పడి ఏడ్చారట. ఈ పెద్దవాళ్ళెప్పుడూ యింతే!! ●




Printed and Published by S. NageswaraRao at the Andhra Patrika press, MallikarjunaRao Street Gandhinagar, Vijayawada-3. Editor: S. Radhakrishna

